ప్రథమ ముద్రణ:
అక్టోబర్ '57

వెల: 50 నయా పైసాలు.

ఇందులోని పాత్రలు,సన్నివేశాలు, నామధేయాలు-అన్నీపూర్తిగా కల్పితాలు. ఎవరినీ ఉద్దేశించినవి కావు. విగత సజీవ వ్యక్తులకు ఏ మాత్రం పోలికలున్నా-అవి కేవలం యాదృచ్ఛికమే

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ వీధి,
మద్రాసు-1.

# ౧

కమీషనర్, మహమ్మదాలీ ఆఫీసులోకొచ్చి, సీట్లో కూచునీ కూచోవడంతోనే డ్రాయరుమీద ఎర్ర సిరాతో వ్రాయబడివున్న ఒక నోట్ చూసి విభ్రాంతు డయ్యాడు. ఆశ్చర్యంతో దాని నందు కుని, యిలా చదివాడు-

‘అయ్యా,

నావల్ల మీకు చాలా శ్రమ కలుగుతూన్నందుకు విచారిస్తు న్నాను. నేను, మీ రందరు అనుకుంటున్న మరమనిషినయినా, నావల్ల ఒక వ్యక్తికి తప్ప, యింకెవరికీ హాని జరగదు. ఆ వ్యక్తి, మేయరు భూపాలరావు! నేను వాడొక్కణ్ణి మాత్రమే హతమార్చడానికి కంకణం కట్టుకున్నాను. అంతపనీ జరిగించి తీరతాను! ఆ సందర్భంలో, నా కడ్డు నిలిచినవా రందరూ హజామత్! (మీరయినా సరే) కాబట్టి, మీరుగాని, మీ మిత్రుల్గాని, ఈ విషయంలో కలగ జేసుకోకండి! ఇదే మీకు నా హుషార్!’

ఇట్లు,

అందరూ అనుకొనే

మరమనిషి.’

ఆ వుత్తరం చదివేటప్పటికి, కమీషనర్‌గారి మెదడు వేడెక్కింది. ఆయన సీట్లోంచి లేచి నిలుచున్నాడు. చదివిన వుత్తరాన్నే రెండు మూడుసార్లు చదివాడు, చదివినకొద్దీ ఆయన కావేశ మెక్కువవుతోంది.

'ఎవడు వీడు? నా బల్లమీది కీ వుత్తర మెలా వొచ్చింది? నన్నెదుర్కొడానిక్కూడా సాహసించాడా? ఒకే ఒక వ్యక్తి, తాను హజామత్ చేస్తాడూ? అందుకు మేమందరం మెదలకుండా వూరుకోవాలీ? అడ్డునిలుస్తే, నా పనికూడా అంతేనా?...'

అని తనలో అనుకొంటూనే, కాలింగ్ బెల్ మోగించాడు. డ్యూటీలో వున్న ఒక స్పెషల్ పోలీసు హాజరై, సలాం చేశాడు.

'నువ్వెంతసేపట్నుంచి యిక్కడ డ్యూటీలో వున్నావు?'

'ఉదయం ఆరు గంటల్నుంచీ డ్యూటీ నాదేసార్.'

'ఆఫీసులో కెవరయినా వచ్చారా?'

'ఎనిమిది గంటలకు మిస్. మేరీజాన్, లేడీ యస్. ఐ. గారొచ్చారండి.'

'ఇంకా?'

'ఆ తరువాత మరో గంటకి, మిష్టర్ గేలబ్‌గా రొచ్చారండి,

'మేరీజాన్ ఎంతసేపు వుంది?'

'పది నిమిషాలుండి వెళ్ళిపోయారు, తమరు లేరని. మళ్ళీ వొస్తామన్నారండి.'

'మా గేలబ్?'

'ఆయన అరగంట యివతలి వరండాలో కూర్చొని వెళ్ళారు.'

'ఇంకా యెవరయినా వచ్చారా?'

'లేదు సార్-ఆ! స్వీపర్ వెంకటస్వామి వచ్చాడు. గదులన్నీ తుడిచి వెళ్ళాడు.'

'వాడిని పిలు.'

వెంటనే స్వీపరు వెంకటస్వామి హాజరు పెట్టబడ్డాడు.

'ఏమిరా! నువ్వీ గది తుడిచేటప్పుడు, డ్రాయరుమీద కాయితా లేమయినా సర్దావా ?'

'లేదుసార్ !'

'పోనీ ! ఎర్ర సిరాతో రాసిన యీ కాయితం డ్రాయరుమీద వుందేమో చెప్పగలవా ?'

అని, కమీషనర్ తన చేతిలోని కాయితాన్ని వెంకటస్వామికి చూపగా, వాడు నిదానించి చూచి-

'ఆ కాయితమే ననుకుంటానండి - తుడిచేటప్పుడు కింద పడి వుంటే, తీసి డ్రాయరుమీద పెట్టాను.'

'కింద పడుందా ?'

'మరేనండి-'

'దీన్ని నువ్వు యెక్కడుండగా తీశావు ?'

'గుమ్మానికి కొంచం యివతలగా పడుంటే తీశానండి-'

'అంటే, యీ గదిలోనే కదా ?'

'అవునండి - బల్లమీంచి గాలి కెగిరి పడివుంటుం దనుకొని- మళ్ళీ అక్కడే పెట్టేశానండి.'

'సరి-పో.'

అని అధికారి చెప్పిన వెంటనే. వెంకటస్వామి వెళ్ళిపోయాడు.

'నువ్వు డ్యూటీలో కొచ్చినప్పట్నుంచీ, యీ ఆఫీసుగది కిటికీ లన్నీ తీసివున్నాయా ? మూసివున్నాయా ?' అని కమీషనర్ డ్యూటీలో వున్నవాని నడిగారు.

'తీసే వున్నాయండి.'

'రాత్రి ?'

'రాత్రి సంగతి నాకు తెలీదండి.'

అంతలో మిస్. మేరీజాన్ లోపల ప్రవేశించి, శాల్యూట్ చేసి నిలుచుంది. అధికారి ఆజ్ఞ ప్రకారం, పోలీసు జవాను యివతల కొచ్చేశాడు.

'సర్కిలుగారు మరమనిషి సందర్భంలో మీకు స్పెషల్ డ్యూటీ వేశారని విన్నాను.'

'అవునుసార్ !'

'కష్టపడి పనిచేశారంటే, త్వరగా సర్కిలు గ్రేడ్‌కు పోవచ్చు—'

'అఁ అఁ! అదేసార్! కొద్ది రోజుల్లో మరమనిషి పట్టుబడి పోతాడు-నేను పట్టుకు తీరతాను.'

'మళ్ళీ యేమయినా విశేషాలు ?'

'అదేకదా! చెప్పాలని యింతకు ముందోసారి వచ్చాను. మీరు లేరు, అందుకని మళ్ళీవచ్చా. ఈ వుదయం సరిగా ఏడు గంటలకు నేను, మన పోలీసు 'కేంటీన్'లో కాఫీ తాగుతున్నా. కాఫీ తాగడం అయిం తరవాత, బిల్లు చెల్లించటం కోసం, కౌంటరు దగ్గరి కెళ్ళి జేబులో చెయ్యి పెట్టేటప్పటికి ఇదుగో, నా జేబులో యీ వుత్తరముంది. ఇది నా జేబులో కెలా వొచ్చిందో యింత వరకూ అర్థం కాలేదు.'

అంటూ మిస్. మేరీజాన్, తన కోటు జేబుతోనుంచి, ఎర్ర సిరాతో రాయబడిన ఒక వుత్తరం తీసి, కమీషనర్‌గారి కందించింది. మహమ్మదాలీ దాన్ని ఆశ్చర్యంతో చదువుతుండగా లేడీ యస్. ఐ. తిరిగి యిలా అంది:

'హోటల్లో డబ్బులిచ్చి, నేరుగా మీ దగ్గరికే వచ్చాను. నా జేబులో యీ వుత్తర ముండడం చాలా ఆశ్చర్యంగా వుంది.'

తన ఆఫీసు గదిలో కొచ్చి పడ్డ వుత్తరము, లేడీ యస్. ఐ. జేబులో కొచ్చి పడ్డ వుత్తరమూ ఒకేలాగున వున్నందుకు కమీషనర్ మరీ యెక్కువ ఆశ్చర్యమును పొందాడు.

'అదే దస్తూరి-అదే సిరా-అదే సంగతులు!' అనగా—

'ఇటువంటిది మరొక వుత్తరముందా?'

అని, మిస్. మేరిజాన్ అడిగింది. కమీషనర్, బల్లమీద వున్న ఎర్ర సిరా వుత్తరమును ఆమెకు చూపుతూ—

'ఎలా వొచ్చిందో-ఈ యెర్ర సిరా వుత్తరం నా ఆఫీసు రూములో కొచ్చి పడింది' అన్నాడు.

లేడీ యస్. ఐ: కూడా ఆ వుత్తరం చూచి ఆశ్చర్యపోయింది.

'సంగతులుకూడా రెండుత్తరాల్లోనూ ఒకటే-ఆ మరమనిషి మనల్నివిధంగా బెదిరించాలని చూస్తున్నాడు గాబోలు. కాని, మనం బెదురుతామా? వాడి అంతు కనుక్కొని తీరతాం.'

'అది సరే-మీ జేబులో కీ వుత్తరం యెలా వచ్చిందని?'

'అదే అర్థంకావడంలేదు. నేను కాఫీ తీసుకుంటున్నప్పుడెవరో నాపక్కగా కూర్చుని, నాకు తెలీకుండా యీ వుత్తరమును నా జేబులో పడేసివుంటాలి.'

'ఇది, మరమనిషి స్వయంగా చేసిన పనికాదు.'

'ఎలా అవుతుంది? హోటల్లోకి మరమనిషివస్తే, కనుపించదూ? కనిపిస్తే వూరుకుంటామా? వాడితాలూకు మరొకరెవరో యీ పని చేసివుండాలి.'

'దీనినిబట్టి వాడికి సహాయం చేసేవారింకా యెవరో వున్నట్లు తెలుస్తూంది.'

'అవును. వాడికెంత సాహసమో చూడండి! మీ ఆఫీసు

గదిలో కొక వుత్తరము-నా జేబులో కొక వుత్తరము చేర్చాడు.'

'సరి-ఈ విషయ మిలావుండగా-మేయరుగారి కెలావుంది?'

'నిన్న సాయంకాలం నే నాయన్ను కలుసుకుని మాట్లాడాను. చాలావరకూ స్వస్తత చేకూరింది. కాని, జరిగిన ఘోర సంఘ టనవల్ల ఆయన బెదిరిపోయివున్నాడు. మరమనిషి ఆయన కంఠం పట్టుకున్నప్పు డక్కడ రెండు గోళ్ళ గురుతులు స్పష్టంగా కనబడుతున్నాయి. కాని, అవి మనిషిగోళ్ళకు సంబం ధించిన గుర్తులుగా లేక, పెద్దవిగా వున్నాయి. వాటి ఫోటోలు తీసి, నిపుణులకు పంపాము.'

'మరమనిషి భూపాలరావుగార్ని ఒక్కర్నీ మాత్రమే హత మార్చడానికి పూనుకున్నట్లు వుత్తరాలవల్ల, అతని చర్యలవల్లా స్పష్టమవుతూంది.'

'రాణి యమ్మారావుగారి జన్మదినోత్సవంనాడు మేయర్‌గారు మరమనిషి చేతుల్లో చచ్చి పోవలసిందే!'

'అవును-అదృష్టవశాత్తూ ప్రమాదం తప్పింది. మనలాంటి వాళ్ళం యింతమంది వుండి, ఆ మరమనిషి అంతు కనుక్కోలేక పోయామంటే, చాలా అప్రతిష్ట-పోలీసు శాఖకే అవమానం!'

'ఇప్పుడిక నేను పూనుకున్నాను గాబట్టి, వాడి సంగతి తేలుస్తా సార్!'

అని, లేడీ యస్. ఐ. అన్నదానికి కమీషనర్ ఓ చిరునవ్వు నవ్వి—

'మీరు ధైర్యంగా అంతమాట అన్నందుకు చాలా సంతోషం.' అన్నాడు.

'అనడంగాదు-పట్టి తీరతా చూడండి.

'ఒక్క భూపాలరావుగారి మీద మాత్రమే ఆ మరమనిషి

యింత కక్ష వహించడానికిగల కారణమును ముందుగా తెలుసుకోవాలి. భూపాలరావుగారు తన స్టేటుమెంటులో తన కెవరూ విరోధులు లేరని చెప్పాడు, మరి యిదేమిటి? అందువల్ల మనం తక్షణం రాణియమ్మారావుగారి యొక్క, భూపాల రావుగారియొక్క జీవిత చరిత్రలను సంగ్రహంగా రికార్డు చెయ్యటం చాలా అవసరం.'

'వాటివల్ల మనకేం లాభముంటుంది?'

'చాలా వుంటుంది. గడచిపోయిన వారి జీవితవిశేషాలను బట్టి మరమనిషియొక్క కూపీ లాగవచ్చు.'

'అది నా వూహ కందడంలేదు అయినా, మీరు చెప్పిన ప్రకారం వారి జీవితసంగ్రహం తప్పక రికార్డు చేసుకొస్తాను.'

'ఆ పని చాలా జరుగురు-అవసరమూ కూడా. అయితే ఆ పనిని సాధించడమెలాగ ?'

'రాణియమ్మారావుగారి నడుగుతే ఆమె చెబుతుందిగదా సార్ ?'

'చెబుతుంది. మేయరుగారు దగ్గరలేనప్పుడు ఆమెను-ఆమె దగ్గర లేనప్పుడు మేయరుగార్నీ అడిగి, వారి జీవిత విశేషాలు రికార్డు చెయ్యాలి. మరమనిషి యెవరో వారికి తెలియక పోవచ్చుగాని, వాళ్ళ జీవితాలకూ, యీ మరమనిషికీ ఏదో దగ్గర సంబంధం వుండివుంటుందని నా నమ్మకం.'

'మీరు చెప్పింది నిజం కావచ్చు. లేకుంటే, మరమనిషి ప్రత్యేకం భూపాలరావుగారి మీద కత్తిగట్టడానికి కారణ మేముంటుంది ?'

'ఆ సంగతంతా నేను తరవాత చెప్తాగా! మీరు ముందుగా పోయి, నేను చెప్పినట్లు చెయ్యాలి.'

'వెరీగుడ్ సార్ ! వొస్తా.'

అని, లేడీ యస్. ఐ. మిస్. మేరీజాన్, కమీషనర్‌గారి దగ్గర శలవు పుచ్చుకొని వెళ్ళిపోయిన మరికొన్ని క్షణాల్లో, సర్కిలు రంగనాథం, యస్ ఐ. శామ్యూలూ, ఇద్దరూ చెరో చేత్తోనూ ఎర్ర సిరా పుత్తరాలు పట్టుకొని ప్రవేశించారు. వాటిని చూసీ చూడ్డంలోనే కమీషనర్ విషయమును వెంటనే అర్థం చేసుకొని—

'ఎర్ర సిరా శుభలేఖలు మీకూ అందాయన్నమాట ?' అనగా సర్కిల్, సబ్‌యిన్‌స్పెక్టర్లిద్దరూ తెల్లబోయారు.

'అంటే, మీక్కూడా మరమనిషి యిటువంటి పుత్తరం రాశాడా !' అని సర్కిలడిగాడు.

'నాకేకాదు—మిస్. మేరీజానుక్కూడా !'

'దీన్నిబట్టి, ముఖ్యమయిన పోలీసుద్యోగులందరినీ మర మనిషి యిటువంటి ఎర్రసిరా పుత్తరాలతో బెదిరిస్తున్నాడని తెలుస్తూంది.'

'మీకి పుత్తరా లెలా చేరాయి ?'

'లాండరీవాడు 'అయిరన్' చేసి తీసుకొచ్చిన నా కోటులో వుందీ పుత్తరం' అని సర్కిలు—

'నిన్నరాత్రి నే నింటికి వెళ్ళేటప్పటికి మా 'జాన్ బేబీ' మూడేళ్ళ కుర్రాడు, యీ కాయితంతో ఆడుతుంటే తీసుకుని చూసి ఆశ్చర్యపోయాను' అని శామ్యూలూ చెప్పగా—

'ఆ మరమనిషి, మన అందరకూ ఒకే రకమయిన యీ ఎర్ర సిరా పుత్తరాలు అందజేసిన విధానం చాలా అద్భుతంగా వుంది' అన్నాడు కమీషనర్.

'దీనిని బట్టి, మేయరు భూపాలరావుగారి కొక ప్రబల విరోధి

వున్నాడనీ—ప్రత్యేకం ఆయనమీద మాత్రమే కక్ష తీర్చుకోడానికి మరమనిషి బయలుదేరాడనీ మన కర్థమవుతూంది. ఆ సందర్భంలో అడ్డునిలిచిన వాళ్ళ నందర్నీ హజామత్ చేస్తానని మరమనిషి సవాల్ చేస్తున్నాడు.'

అని శామ్యూలు తిరిగి అన్నమీదట—

'మన పోలీసుశాఖ యావత్తూ కలిసి, ఒక్క మనిషికి రక్షణ ఈయలేక పోవటము—మరమనిషిలాంటి ఒక దుండగీడును పట్టి బంధించలేక పోవటము—చాలా అవమానకరమయిన విషయంగావుంది'

అని కమీషనర్ అన్నదానికి, శామ్యూలు, రంగనాథము లిద్దరూ మౌనమును వహించారు. తరువాత, కమీషనర్ తిరిగి యిలా అన్నాడు:

'మొట్టమొదటగా, ఆ మరమనిషిని పట్టబోయి గాయపడ్డ అతనెవరు ?'

'వాడు సోడావాలా, చంద్రం. తమరు రివార్డుకూడా యిచ్చారు సార్ !' అని సర్కిలనగా—

'ఆఁ ! వాణ్ణి నేను జరురుగా ఒకసారి కలుసుకోవాలి—కబురుచెయ్యండి'

అని చెప్పిన తరవాత, కమీషనర్ మిగిలిన ఆ యిద్దరు ఉద్యోగులనూ వెంటబెట్టుకొని, తన కారులో యెక్కడికో బయలుదేరాడు.

## ౨

సీనప్ప, కుమార్ని ఎత్తుకు పెంచిన నౌఖరు. ఎనభై యేళ్ళ వయసుదాటినా, కాయ శరీరం వాడవటంచేత, యింకా దారుఢ్యంగా వున్నాడు. బాధ్యతగల యింటి పనులన్నీ అతనే

చేస్తాడు. రాణియమ్మారావుగారి భవనం యొక్క ముందరి గేటుదగ్గర ఒక కారు షెడ్‌లో సీనప్ప మకాం. అక్కడ తన వంట తనే చేసుకుంటాడు. ఇంటి పనులన్నీ అయిపోయింతర వాత కృష్ణ, రామ, అనుకుంటూ, ఆ షెడ్‌లో వుండే కార్లో పడుకుంటాడు. కృష్ణకుమారి, యిప్పుడుకూడా తీరిగ్గా వున్నప్పు డతని దగ్గిరకొచ్చి కూచుంటూ, అతను పాడే భజన కీర్తనలు విని నవ్వుతూ వుంటుంది. చనువుచేత, 'దాదా' అంటూ చెవులు పట్టి ఆడిస్తుంది కూడా.

సీనప్పకి ఆమె యేం చేసినా సంతోషమే. ఆమెకు త్వరగా పెళ్ళి కావాలనీ, ఆమె కడుపున ఓ కాయ కాయాలనీ, ఆ వంశం వృద్ధి కావాలనీ అత నెప్పుడూ కోరుతుంటాడు. రాణియమ్మా రావుకూ, భూపాలరావు కూడా సీనప్ప మీద చాలా గౌరవ ముంది. అతన్ని మిగిలిన నౌఖర్లతోపాటు చూడకుండా, ప్రత్యే కాదరాభిమానాలతో చూస్తారు. అతని మాట కాయింట్లో యెక్కువ విలువకూడా వుంది.

ఆ రోజున మిస్. కుమారి, కాలేజీ నుంచి వచ్చి రావడం తోనే, గేటుదగ్గిరే కారాపు చేసి,దిగింది. షెడ్‌లో సీనప్ప వుండి—

'కార్ని లోపల పెట్టడానికి నేనడ్డంగా వున్నా ననుకుంటా—లేస్తున్నానమ్మా—లేస్తున్నా,'

అంటూ సీనప్ప, అప్పుడు, తుప్పుపట్టిన తన పాత ట్రంకు పెట్టెలోని గుడ్డలు పగ్గె రాల్ని కిందపడేసి సర్దుకుంటున్నవాడు, త్వరత్వరగా వాటి నన్నింటినీ తిరిగి తన పెట్టెలో వేసి, దారి కడ్డం లేవడానికి ఖంగారు పడుతుండగా, కుమారి లోపలి కొచ్చి—

'నాకోస మెవరన్నా వచ్చారా దాదా?' అని అడిగింది. సీనప్ప ఆమె మాటలు, సగమే వినిపించుకొని—

'ఆఁ! గేలబ్ వచ్చాడు—'

అంటూ కింద వున్న తన దుస్తులూ వగైరాల్ని పెట్టెలో పడెయ్యడానికి ఖంగారు పడుతున్న సమయంలో, అక్కడి సామానుల్లో దుమారి కొక ఫోటో కనుపించింది సీనప్ప చూడకుండా వున్నప్పుడు, కొంటెతనంగా ఆ ఫోటోను తీసి, తన పుస్తకాల్లో పెట్టుకొని, ఏమీ యెరగనట్లు—

'ఏమన్నావు దాదా ? గేలబ్ వచ్చాడా ?' అని తిరిగి అడిగింది

అప్పటికి సీనప్ప, నేలమీద చిందర వందరగా వున్నవాటి నన్నింటినీ పెట్టెలో పడేసి, పెట్టెను కాళ్ళతో ఓ పక్కగా తోసేసి—

'ఆఁ! యిప్పుడు దారికడ్డమేం లేదు. కార్ను లోపలకు తీసుకురా అమ్మా—' అన్నాడు.

'కారునిప్పుడు షెడ్‌లో పెట్టను. తిరిగి బయటికి పోతున్నా' అని ఆమె అనేటప్పటికి, తన ఖంగారంతా అనవసరమైందనుకొని, ఆ వృద్ధుడు—

'సరే, అయితే,' అన్నాడు. తరవాత ఆమె అడిగిన ప్రశ్నను మళ్ళీ జ్ఞాపకం చేసుకొని, యీసారి తాపీగా జవాబు చెప్పాడు.

'నీ కోసమెవరొచ్చారని అడిగావు కదూ ? గేలబ్ వచ్చాడు. బాబుగారితో చాలాసేపు మాట్లాడి వెళ్ళాడు. ఇప్పుడిప్పుడే ఆసోడాల కుర్రాడు...'

'చంద్రం! వొచ్చాడా ?'

'ఆఁ! బాబుగారు వాణ్ని కసిరి, పొమ్మన్నారు.'

'కసిరి పొమ్మన్నారా ?'

'అవును.'

'ఎందుకూ అతన్ని కసరడం.'

'ఏమో! నువ్వు తరుచు మా యింటికి రాకూడదు పో! అన్నారు కోపంగా. చంద్రం ముఖం చిన్న చేసుకొని వెళ్ళి పోయాడు.'

అందుకు కుమారి మనసు చాలా కించ పడింది.తన భావాల్ని పైకి కనుపించనీకుండా—

'నేను రమ్మంటేనే అతనొచ్చాడు. నాన్నగారు వాడిమీద కోపం చెయ్యడం చాలా అనవసరం.'

అని ఆమె వెళ్ళబోయి, తిరిగి ఆగి—

'దాదా! నీవేమన్నా పారేసుకున్నావా ?'

అని కొంటెతనంగా నవ్వుతూ అడిగింది.

'పారేసుకోడానికి నా దగ్గరే ముందమ్మా ?'

అని, దాదా ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆమె వెంటనే తను దాచిన ఫోటోను ఇచ్చెయ్యకుండా—

'నాకు దొరికింది నేనియ్యను' అంది.

'ఉంచుకో అమ్మా! అంతోటి విలువగల వస్తువులు నా దగ్గరే మున్నాయి? ఉన్నా, నీ దగ్గరుంటే ఒకటీ, నా దగ్గరుంటే ఒకటే కాదుగా!'

అని దాదా, తన దగ్గిరవున్న దాన్నిగురించి ఎంత మాత్రం ఖంగారు పడకపోవటం వల్ల-

'దాదా! నీది నీకిచ్చేస్తాగాని, నేనడిగింది మాత్రం తప్ప కుండా చెప్పాలి-'

అని పకపక నవ్వుతూ, తన పుస్తకాల్లో వుంచిన ఫోటోను యివతలికి తీసి-

'ఇదుగో! ఎవరిదీ!' ఫోటో అని అడిగింది.

ఆ ఫోటోను చూచినప్పుడు, దావా చాలా ఖంగారు పడ్డాడు. ఆమె చేతులో దాన్ని లాక్కోడానికి ముందుకొచ్చాడు.

'ఏంవిటా ఖంగారు దావా! నా దగ్గరున్నా, నీ దగ్గిరున్నా ఒకటే అన్నావుగా ?' అంది కుమారి ఫోటో ఇయ్యకుండా.

'అది నీ దగ్గరెందుకుండే అమ్మా! ఇలా ఇయ్యి'

అంటూ, అతనామె చేతిలో దాన్ని బలవంతంగానే లాగుతున్నాడు. ఆమె వదలకుండా-

'గట్టిగా లాగుతే, చిరిగి పోతుంది దావా' అంది

అదే సమయంలో భూపాలరావెక్కడికో వెడుతూ, ఆ యిద్దరి చేతుల్లోనూ ఫోటో వుండడమూ, దానికోస మిద్దరూ పెనుగులాడుతుండటమూ చూశాడు. అతని రాకను గమనించగానే, కుమారి ఫోటోను దాదాకు ఒదిలేసి యివతల కొచ్చి.

'చంద్ర మొచ్చాడా నాన్నా ?' అని అడిగింది.

'ఒచ్చాడు' అని భూపాలరావు ముఖం చిట్లించుకొని బదులు చెప్పాడు.

'అతను చాలా మంచివాడుగదా ? మన కెంత వుపకారం చేశాడు, పోలీసులు రివార్డు కూడా యిచ్చారు.'

'అయితే మాత్రం, వాడు తరుచు మన యింటికి దేనికీ ? వాడు చేసిన వుపకారానికి ప్రత్యుపకారం వెంటనే చేశాం. వంద రూపాయలు.'

'ఎన్నివేలిస్తే మాత్రం, మనం అతని ఋణం తీర్చగలం ?' అని, కుమారి అడిగిందానికి బదులు చెప్పకుండా, భూపాలరావు ముందుకుపోయి, గేటు దాటాడు. కుమారి అక్కడే కారు దగ్గర నిలుచుని చూస్తూంది. మరమనిషిని గురించి కాపలా వున్న రిజర్వు పోలీసులలో ఒకడు భూపాలరావుకు నమస్కరించి—

'ఎక్కడికి సార్ ?' అని అడిగాడు.

'ఎక్కడికిలేదు' అని ఆయన పరధ్యానంగా బదులు చెప్పాడు.

'మీరు ఒంటరిగా వెళ్ళడానికి కమీషనర్‌గారి ఆర్డరు లేదు—అంతగా అవసరమయితే మేముకూడా వుంటాంరండి—' అన్నాడు.

'అహహా! అక్కర్లేదు, పూరికేనే తోటలోకి వెళ్ళాలను కున్నాను—'

అని భూపాలరావు తిరిగి వెనక్కు మళ్ళాడు. ఇంకా అక్కడే నిలుచున్న కుమారితో ఏమీ మాటలాడకుండానే తిన్నగా మేడమీదికి వెళ్ళిపోయాడు. అప్పుడాయన చర్యంతా ఆమెకు కొత్తగా కనుపించింది. తండ్రిగారు మేడమీదికెళ్ళి పోయిం తరువాత, ఆమె తిరిగి దాదా దగ్గిరి కొచ్చింది.

'ఏం దాదా, ఫోటోను భద్రం చేసుకున్నావా ?' అని నవ్వుతూ అడిగింది.

దాదా బదులు చెప్పలేదు.

'నాన్నగారొచ్చారుగాని, లేకుంటే నేను దాన్ని నీకిచ్చి వుండను' అంది.

'అది నీకెందుకులే అమ్మా !'

'అదెవరిదో నాకు చెప్పవా దాదా ?'

'ఆఁ ! ఎప్పటిదో—పాతఫోటో.'

'అదే ! యెవరిదని ?'

దాదా బదులు చెప్పకుండా ముఖము నింకోవేపుకు తిప్పు కున్నాడు.

'నేను వొదిలిపెట్టను. చెబుతావా—చెప్పవా ?'

అంటూ, కుమారి, దాదా ముఖాన్ని తన వేపుకు బలవంతాన తిప్పింది. అప్పుడతని కళ్ళల్లో నీటిబిందువులు చూచి ఆమె నిర్ఘాంత పోయింది.

'ఏం చేస్తున్నావు దాదా! అయ్యయ్యో! అనవసరంగా నీ మనసుకు కష్టం కలిగించసట్టున్నాను. నీ కిష్టం లేకపోతే నాకేమీ చెప్పొద్దులే!'

'చెప్పను. నా కంఠంలో ప్రాణముండగా ఈ సంగతి యెవ రికీ చెప్పనని ప్రమాణం చేశాను. అడగొద్దు తల్లీ! నన్నా ఫోటోను గురించి యింకేమీ అడగొద్దు--'

అని దాదా గద్గదస్వరంతో అంటూ, కన్నీళ్ళు తుడుచు కుంటున్నాడు.

'నన్నెత్తుకు పెంచినవాడివి: నా దగ్గర నువ్వే విషయమూ దాచవు. అందుకని అడిగాగాను, నీ మనసు కింత కష్టం కలుగు తుందని తెలుస్తే నేనెందుకు అడుగుతా దాదా! ఆ ఫోటోకు సంబంధించింది, అంత పరమరహస్యమని నేననుకోలేదు— చెప్పొద్దులే నాకేమీ చెప్పొద్దు.'

'దాదామీద నీకోపమొచ్చిందా? నీకోపమొస్తే నేనసలు బతకలేనమ్మా—'

'లేదులే.'

'నాదగ్గరి ఫోటో వుందనికూడా నువ్వెవరికీ చెప్పకూడదు- తెలిసిందా?'

'సరే చెప్పను. అదుగో నీ కళ్ళల్లో యింకా తడి కనబడు తూంది. ముందర తుడుచుకో.'

అని కుమారి హెచ్చరించిన మీదట, దాదా కళ్ళు తుడుచు కున్నాడు. ఆమె తన చేతి గడియారంవేపు చూసుకుంది.

'క్లబ్బుకి పోతున్నా దాదా అమ్మకు చెప్పు.'

అని కుమారి, లోపలకు వెళ్ళకుండా అక్కడినుంచే కారులో యెక్కి బయలుదేరింది. మొదట క్లబ్బుకు పోవాలనే అనుకొంది. కాని, తీరా బయలుదేరి కొంతదూరం వొచ్చేటప్పటికామె బుద్ధి సినిమావేపుకు మళ్ళింది ఆమె బుద్ధితోపాటు, కారుకూడా సినిమాథియేటరువేపు మళ్ళింది. ఆమె హాలు చేరేటప్పటికి, ఆట ప్రారంభం కావటానికింకా చాలా వ్యవధి వున్నట్లు తెలిసింది. సోడా దుకాణాలూ, టీ అంగళ్ళూ అప్పుడప్పుడే సర్దుకొంటున్నారు. కుమారి, కారు దిగకుండా లోపల్నేవుండి అని వేపులా చూస్తూంది. కొండలుతో అప్పుడే సోడాలబండి తోసుకొచ్చి, గ్లాసులూ వగైరాలు కడుగుతున్న చంద్రం, కారులోవున్న కుమారిని చూచాడు. వెంటనే చేతులు తుడుచుకుని, కారు దగ్గరికి పరుగెత్తుకొచ్చాడు.

'సాయంకాలం మీ యింటికెళ్ళాను. మీర్లేరు. మీ నాన్నగారి కెందుకో నామీద కోపంగావుంది 'నువ్వు తరుచు మా యింటికి రాకూడదు పో' అన్నారు. వెంటనే తిరిగివొచ్చేశాను.'

'ఆయన అదోరకం మనిషిలే! అలా అన్నారని మనసులో కష్టం పెట్టుకోకు చంద్రం—'

అంటూ, అతని చేతులు పట్టుకోబోయి, వెంటనే తిరిగి తన చేతుల్ని వెనక్కిలాక్కుంది.

'తరవాత, నా తప్పు నాకే తెలిసింది. అంతస్తు తెలుసుకోకుండా పెద్దవారింటికి తరుచు పోకూడదనుకున్నా.'

అని, చంద్రం చెప్పిన మాటలు, కుమారి చెవులకు ములుకుల్లా వున్నాయి, ఆమె మనస్సుకు చాలా కించ కలిగింది.

'వొస్తా—అమ్మకంవేళ.'

అని చంద్రం, ఆమె జవాబు కెదురుచూడకుండా, కారు దగ్గర్నుంచి వడివడిగా వెళ్ళిపోయాడు. కుమారికి కళ్ళనీళ్లు రున తిరిగాయి. ఆమె మనస్సంతా వికలమై పోయింది.

'చంద్రంలో ఇంతలోనే ఎంత మార్పు! అవును-కూటికి పేదలయితే, గుణానికి పేదలవుతారా? నేను రమ్మన్నాను గదా అని యింటికొచ్చాడు. నాన్నగారతన్ని తూలనాడితే ఆత్మాభిమానంగల మనిషి ఎలా సహించుకుంటాడు? జరిగిం దానికి క్షమాపణ కోరటానికే అనుకున్నా ఈయనుండా వెళ్ళి పోయాడు అంతస్తు-పెద్దవాళ్ళు-ఏ విషయంలో? ఎవరు? డబ్బుగలవాళ్ళు పెద్దవాళ్ళా?'

అని, ఆమె తనలో తానింకా యేమేమో అనుకుంటూ, ఆ కార్లో అలాగే చాలాసేపు కూర్చుండిపోయింది. సినీమా ఆరంభ మయింది. ఆమె కారు దిగలేదు సినిమా కెళ్ళలేదు. ఒకసారి అప్రయత్నంగా తన రిస్టువాచీవేపు చూసుకుని, నిట్టూర్పు విడిచింది. బరువెక్కిన హృదయంతో కారు స్టార్టు చేసింది. ఆమె ప్రయత్నంచేసింది కాని, చంద్రం మళ్ళీ కనుపించలేదు.

## 3

లేడీ యస్. ఐ. కాటష్ట్రి, మిస్. మేరీజానును ఏ ద్వారం దగ్గిరా, ఎవరూ అటంక పరచలేదు. కాపలా వున్న మిలిటరీ పోలీసులు సహితం, సలాములు చేసి ఆమెను లోనికి పోనిచ్చారు. మేరీజాన్ మెట్లెక్కి రాణియమ్మగారువుండే రాణీ వాస మందిరానికి పోయిచేరింది. తన రాకను అమ్మారాణిగారికి తెలుపు చేసి, వెలుపలి హాలులో పది నిమిషాలు వేచివుంది. కాని ఆవిడ యింకా యివతలకు రాకపోవటంవల్ల, లేడీ యస్. ఐ. అక్కడి సాధన సామగ్రినీ, అలంకరణాలనూ తిలకిస్తూ కూచుంది. ఆ మందిర భాగమంతా చాలా శృంగారంగా వుంది. నిలువుటద్దాలూ, ముఖమల్ కుషనులూ, అవన్నీ జమిందారుల యిళ్ళల్లో వుండేవే, వాటికామె ఆశ్చర్యపడలేదు.

కాని—

ఆమె కూర్చున్న హాలుకు కుడి ప్రక్కగా వున్న మరో గది గుమ్మానికి కమర్చబడి వున్న తెర, గాలి తాకుడుకు అల్లాడుతూ న్నప్పుడా తెర సందుల్లోంచి కనిపిస్తున్న ఓ పందిరి మంచము దానిపై అమర్చబడివున్న పక్క ఆమె దృష్టి నాకర్షించాయి. అంత శృంగారంగా వున్న పాన్పు నామె అంతవరకు ముందెప్పుడూ చూచివుండక పోవటంవల్ల, కూర్చున్న మనిషి లేచింది. రెండడుగులు ముందుకువేసి, తెర తొలగించి చూచింది. చిత్ర విచిత్రములయిన నగిషీ పనులతో చెక్కబడిన ఆ మంచంపై, వెల లేని ఒక ముఖమల్ స్ప్రింగు పరుపు. ఆ పాన్పుకు రెండు వేపులా రెండు పెద్ద అద్దములు. అద్దములచుట్టూ కొన్ని శృంగార పటాలు! అన్నిటికంటె ముఖ్యమైనదా పాన్పు ఎదురు గోడ కమర్చబడి వున్న కొన్ని నగ్న చిత్రపటాలు, వివిధ బంధనాలు సూచిస్తుంటే తిలకించిన మేరీజాన్ విగ్రహంవంటి కామమును రేకెత్తించే ఒకమోటంతో వున్న ఆ బొత్తు బొమ్మలనామె చూడ లేక, ఉద్రేకాలం తన ఓర్పోటిట్లు చూస్తుంది.

'వూతపు టింకా పెళ్ళికాలేదు గదా! కామంతా పూరితమై వున్న యీ గదిలో రాణియమ్మారావే భర్తతో శయనిస్తుంది గాబోలు!'

అని తనలో అనుకొని నవ్వుకొంటుండగా, మరోవేపు గది లోంచి వచ్చిన రాణియమ్మారావు,

'క్షమించాలి! మిమ్మల్ని కాసేపు కూచోబెట్టాను.' అంది.

'అఁ! పరవాలేదు లెండి!'

అని మేరీజాన్ నవ్వుతూనే బదులుచెప్పింది. రాణియమ్మా రావు ధరించివున్న దుస్తులనుంచి వచ్చే ఘుమఘుమ వాసనలకు మేరీజాన్‌కు కూడా మత్తుకలుగుతోంది. పడకగదిలో చూచిన శృంగార అలంకరణాలకూ, అప్పుడా రాణియమ్మారావు నుంచి

వెలువడే గుబాళింపులకూ సరిపోయిందనుకొంది మేరీజాన్ తనలో.

రమారమీ నలభై యేళ్ళ ముదివయస్సులో వుండిన్నీ రాణి యమ్మారా పటువంటి విలాసవతిగా వుంటే, యిక ఆమె పడుచుదనంలో యెలావుండేదో లేడీ యస్. ఐ. వూహించుకుంది.

'మీకిప్పుడు వయస్సెంతండీ?'

'మొన్ననేగా ముప్ఫయ్యారో జన్మదినం పండుగయింది - మీరొచ్చారుగా ?'

'అవునవును. అది ముప్ఫయ్యారోదా ?'

'ఎందుకలా అడిగారు ?'

'మీలో యెప్పుడూ పడల్లేదు - చిదిమితే పాలుగారేలా వున్నారు అసలు పడుచుదనంలో యింకా యెలావుండేవారో...'

అని మేరీజాన్ అన్నదానికి రాణియమ్మారా వొకసారి ఫకాలున నవ్వి - జాన్ వీపుమీద తట్టుతూ,

'రాత్రీ పగలూ పోలీసు డ్యూటీలో కొట్టుకుంటూ వుంటారు. జీవితానందం మీకేం తెలుస్తుంది?' అంది.

'నాకింకా పెళ్ళికాలేదనుకోండీ, అయినా ఈ మరమనిషి గొడవొచ్చినప్పట్నుంచి, కంటికి నిద్దరకూడా లేదు. మా కమీషనర్‌గారు మమ్మల్ని కూడు తిననియ్యడంలేదు. నీళ్ళు తాగ నియ్యడంలేదు.'

'పట్టుపట్టాడా మరమనిషి ?'

'అదే ప్రయత్నం, మీగురించి కొన్ని వివరాలు కావల సుండి వొచ్చాను.'

అంటూ, లేడీ యస్. ఐ. కోటుజేబులోనుంచి నోటు పుస్తకమును, కలమును, తీసిపట్టుకొని-

'మీకిది ముప్ఫయ్యారోయేడు, అయితే అమ్మా, మీకు వివాహ మెప్పుడయిందంటారు ?' అని అడిగింది.

'ఇరవయ్యో యేట.'

'సనాతన ధర్మప్రకారం జరిగిన వివాహమేకదూ ?'

'అదేలెండి-రిజిష్టరీ మేరేజి.'

'భూపాలరావుగారు మీకు కావలసిన సంబంధమూ, పై సంబంధమా ?'

'పై సంబంధమే...'

'ఈ ప్రశ్నలన్నీ దేనికండీ అడుగుతున్నారు ?'

మేరీజాన్ అందుకు బదులు చెప్పకుండా నోటుబుక్కులో రాసుకుంటూ—

'మీకు సంతాన మెందరు ?'

'కృష్ణకుమారి ఒక్కతే...'

'ఆమెకింకా యెందుకు పెళ్ళిచెయ్యలేదు ?'

'చదువు పూర్తికావాలని.'

'మీ యెస్టేటు మొదలయిన ఆస్తులన్నీ మీ భర్తగారి నుంచి వచ్చినవా ? కన్నవారినుంచి వచ్చినవా?'

'రెండు విధాలుగానూ వున్నాయి లెండి.'

'సాలీనా ఆదాయ మెంతండి ?'

'అయిదు లక్షలకు పైన—'

'మీ తోబుట్టువులూ వగైరా పుట్టినింటి బంధువులు ఎవరెవరు ఎక్కడెక్కడ వున్నారు ?'

'ఇప్పు డెవరూలేరు.'

'భర్తగారి తాలూకు ?'

'వారుకూడా యెవరూలేరు.'

'మీ రెప్పుడన్నా, యెవరితోనన్నా విరోధపడ్డారా ?'

'లేదు.'

'మీకాని, మీ భర్తగారికాని విరోధులెవరూ లేరని గట్టిగా చెప్పగలరా ?'

'లేరు.'

'మీ జీవితంలో విశేష సంఘట్టన లేమయినా వుంటే చెప్పండి.'

'ఏమున్నాయి ?'

'మీ భర్తగారి జీవితంలో ?'

'నాకు తెలిసినంతవరకూ యేమీలేవు.'

మీ యిద్దరూ అనుకూలంగానే వుంటారుగదా ?'

'ఆఁ!'

'సరే—యిందులో సంతకం పెట్టండి.'

'నేనా ? నా సంతక మెందుకు ?'

'ఇది కమీషనర్‌గారి ఆర్డరు, మీ దగ్గర్నుంచి, వారి స్టేటుమెంటును కోరారు. ఇది మీకు ప్రమాదించేదికాదు. మర మనిషి కేసులో మాకు ఉపకరిస్తుంది.'

అని, మిస్. మేరీజాన్ చెప్పగా, రాణియమ్మారావు తిరుగు చెప్పకుండా, పుస్తకంలో సంతకం పెట్టింది.

'వెస్తాను.' అని లేడీ యస్. ఐ. తన పుస్తకమును జేబులో పెట్టుకొని లేవబోతుండగా-

'అయ్యయ్యో! ఉండండి-కొంచం కాఫీతీసుకుని వెడుదరు గాని.'

అంటూ రాణియమ్మారావు 'కాలింగ్. బెల్' నొక్కింది వెంటనే ఒక పరిచారకురాలు వచ్చింది. రాణియమ్మారావు సౌంజ్ఞ చెయ్యడమే తడవుగా, పరిచారకురాలు కాఫీ పట్టు కొచ్చి ఇద్దరికి అందించింది. కాఫీ తీసుకోటం పూర్తయిన తరు వాత, లేడీ యస్. ఐ రాణియమ్మారావు దగ్గర శలవుతీసుకుని, మేడపైనించి కింది కొచ్చేసింది. పోర్టికోలో నిలుపుకున్న తన మోటారు బైసికిలును స్టార్టుచేసుకో బోతుండగా, హడావిడిగా వొస్తున్న భూపాలరావామెకు కనుపించాడు.

'హల్లో సార్ ! ఏదో తొందరపనిలో వున్నట్లున్నారు ?' అని, ఆమె అతన్ని పలకరించి, వెంటనే యింజన్ ఆపుచేసింది.

'అహహఁ ! తొందర యేమీలేదు.' అని అతనన్నాడేకాని, అతనిముఖం ఏదో ఖంగారునే సూచిస్తూంది.

'తొందర యేమీ లేకపోతే, మీతో ఒక్క:పదినిమిషాలు-'

'మాట్లాడా లంటారా ?'

'అఁ!'

'రండి-లోపలికి-'

అని, అతను, ముందు హాలు కానించివున్న, తన ఆఫీసు గదిలో కామెను తీసుకెళ్ళి కూచోబెట్టాడు.

'మీ రెంతసేపయింది వచ్చి ?'

'పావుగంటయి వుంటుంది, మీర్లేక పోవటంవల్ల వెళ్ళిపో తున్నాను. కమీషనర్‌గారు, మీ జీవితానికి సంబంధించిన కొన్ని వివరాలు తెలుసుకు రావలసిందని నన్ను పంపించారు.'

'ఏమీలేవే ! నా జీవితానికి సంబంధించిన వివరాలుంటాయి?'

'మీకు వయస్సెంత ?'

'నలభై య్యనువకోచ్చు.'

'మీకు వివాహ మెప్పుడయింది ?'

'నాకు పెళ్ళయి, యిది పదో యేడు.'

రాణియమ్మారావు పదిహేనే ళ్ళయిందంటే, అతను పదే ళ్ళయిం దంటున్నాడేమో అని, మేరీజాన్ తెల్లబోయింది.

'మీకు ఏవూళ్ళో అయింది వివాహం ?'

'మద్రాసులో.'

'ధర్మపద్ధతిలోనే కదా వివాహమయింది?'

'అఁ !'

'రిజిష్టరీ మేరేజి కాదా ?'

'అవును, రిజిష్టరీ మేరేజి.'

'మీకు విరోధు లెవరయినా వున్నారా ?'

'ఎవరూ లేరు.'

'ఎస్టేటు మొదలయిన ఆస్తులన్నీ మీ భార్యవల్ల వచ్చినవా?'

'అవును.'

'మీ పేర ఏమీ లేవంటారా ?'

'లేవు.'

'మీ బంధువులందరూ ఎక్కడున్నారు ?'

'నాకు చెప్పుకోవలసిన బంధువు లెవరూలేరు.'

'మీ జీవితంలో జరిగిన యితర విశేషా లేమయినా వున్నాయా ?'

'ఇదుగో! ఈ మరమనిషి విశేష మొక్కటే చాలా గొప్పది. వాడు నా మీద కత్తికట్టి నన్ను చంపడానికి వెంటాడిస్తున్నాడు. మీరందరూ వుండీస్నీ వాణ్ని పట్టుకోలేకుండా వున్నారంటే చాలా ఆశ్చర్యంగావుంది.'

'పట్టుకు తీరతాం కాని, వాడు మీమీద కత్తిగట్ట డానికి గల కారణం మీరే చెప్పలేక పోతున్నారు.'

'వాడెవడో నాకు తెలీదు. మా యిద్దరికీ సంబంధ మంత కన్నా లేదు. అంతవరకూ నేను గట్టిగా చెప్పగలను.'

'సర్లెండి—యిందులో సంతకం పెట్టండి.'

అని లేడీ యస్.ఐ. అతను చెప్పిన వాటిని రాసుకున్నా నోటు బుక్కు నందించింది.

'ఇందులో నా సంతక మెందుకూ ?'

అని భూపాలరా వాశ్చర్యంగా అడిగాడు.

'కమీషనర్‌గారి ఆర్డరుప్రకారం నేను చేస్తున్నాను.'

అని, మేరీజాన్ అన్న తరువాత, భూపాలరావు బదులు చెప్పకుండా సంతకం పెట్టాడు. మేరీజాన్ అతనిదగ్గర శలవు

తీసుకుని వెళ్ళిపోయింది. ఆమె తనదగ్గిర అవిధంగా స్టేటు మెంటు నెందుకు తీసుకొందా అని అతను దీర్ఘంగా అలోచించాడు. తను చెప్పిందాంట్లో పొరబాటేమయినా వుందేమోనని, ఆమె అడిగినవాటినీ, తాను చెప్పిన వాటినీ, మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం చేసుకొంటూ, రాణియమ్మారావున్న మేడ మీదికి వెళ్ళాడు. అతన్ని చూసి చూడ్డంతోనే ఆమె—

'ఆడ పోలీసు—మీకు కనుపించిందా?' అని అడిగింది.

'మేరీజాన్ నీతో కూడా మాట్లాడిందా?'

'ఆఁ! చాలాసేపు కూర్చొంది నన్నేవేవో ప్రశ్నలడిగి రాసుకుంది.'

'నీదగ్గరకూడా స్టేటుమెంటు తీసుకుందా? ఆ విషయ మామె నాకు చెప్పలేదు. సంతకం చేశావా?'

'ఆఁ! చేశాను.'

'సరి - నాదగ్గరకూడా అదేవిధంగా స్టేటుమెంటు తీసుకొని సంతకం చేయించుకెళ్ళింది. అది కమీషనర్‌గారి ఆర్డరుట - ఎలా కాదంటాము?'

'అందువల్ల మనకు కలిగే నష్టమేమిటీ?'

'ఆమె యేమడిగింది? నువ్వేమని చెప్పావు?'

'ఆ సంగతులప్పుడే మరచిపోయా. ఆఁ! యేముంటుంది? మనకి పెళ్ళి యెప్పుడయిందనీ, ఎస్టేటు ఎవరిదనీ - మనకు విరోధు లెవరనీ—అవే ప్రశ్నలు.'

'నన్నడిగిన వాటినే నిన్నుకూడా అడిగిందన్నమాట? అందు కేదో కారణ ముండివుంటుంది...'

అనుకుంటూ భూపాలరావు అక్కడనుంచి మరోగదిలోకి వెళ్ళాడు. రాణియమ్మారావు కూడా మరోపనిలో నిమగ్నురాలు కావటంవల్ల అందును గురించి యెక్కువగా ఆలోచించలేదు.

౪

కుమారి కారాత్రి నిద్ర పట్టలేదు. చంద్రాన్ని గురించి మరచి పోవాలని ఆమె ఎంతయినా ప్రయత్నం చేసింది. కాని చిన్న బుచ్చుకొన్న అతనిముఖము - ఆవేదనతో అన్న అతని మాటలు, ఆమెకు మళ్ళీ జ్ఞాపకమొస్తున్నాయి.

'అంతస్తు తెలుసుకోకుండా మాయింటికి రావడం నాదేతప్పు. తెలుసుకున్నాను-'

అన్న చంద్రం మాటలామె హృదయాన్నింకా కలచి వేస్తున్నాయి. ఆ మాటలంటున్నప్పుడు తనెంతో బాధపడ్డాడు. ఆమెకు తెలుసు అతనిలోంచి ఆ బాధను తొలగించడానికి తను ప్రయత్నమన్నా చెయ్యలేదా అని కించపడింది.

అంతస్తులు నిర్ణయించే కొలబద్ద డబ్బయితే - మానాన్నగారు పుట్టుకతో ధనవంతులు కారుగా జమీందారిణి అయిన మా అమ్మని పెళ్లిచేసుకోబట్టి ఆయన ధనవంతులయినారు. వారికి కుమార్తెగా పుట్టటంవల్ల నేను ధనవంతురాలి నయ్యాను. ఈ మాటలే నాన్నగారితో అంటే యేమంటారు ? మనం ధనవంతులం గదా అని, ధనంలేనివాళ్ళని అవమానించటం, నిజంగా సహించరానిది. అందులోనూ, చంద్రంలాంటి ఆత్మాభిమానంగల వ్యక్తి అసలు సహించడు. అవును - ఎందుకు సహించాలి ? మా యింటికి రాకపోతే అతనికి గడవదా ? అతని బ్రతుకు మామీద ఆధారపడి వుందా ? మాకతను మహోపకారం చేసినవాడనీ - అతనిలో మంచిగుణాలు చాలా వున్నాయనీ, నాకెందుకో అతని మీద కలిగిన ఆదరాభిమానాలవల్ల, పదిసార్లు చెబితే ఒకసారి వచ్చాడు. అంతమాత్రంలోనే మా గొప్పఅంతా తగ్గిపోతుందా ? మా సంపదలన్నీ అతని కంటుకుపోతాయా ?...

అనే మొదలయిన ఆలోచనలతో ఆమె నిద్రపట్టక ఎంతరాత్రి గడిపిందో ఆమెకే తెలీదు. గడియారం కొడుతున్న గంటలు

కూడా ఆమెకు వినిపించడంలేదు. ఇంటికొచ్చిన చంద్రాన్ని అలా యెందు కవమానించారో తండ్రిగార్నడగడానికి వెంటనే పోవాలన్నంత ఉద్రేకం కలిగిందామెకు. కాని, అర్ధరాత్రి సమయంలో వారికి నిద్రాభంగం చెయ్యటం మంచిదికాదని తిరిగి అనుకొని, తన ఉద్రేకాన్ని తనలోనే అణుచుకొంది. అంతలో వీధిగేటుదగ్గర ఏదో చప్పుడవటంవల్ల, మరమనిషి మనసులో అవతరించాడు. తృళ్ళిపడి పాన్పుదిగి పడక గది లోంచి యివతల వరండాలోకొచ్చి, వీధివేపు లైటు స్విచ్చి నొక్కి ఆ దీపం వెలిగించింది. ఆ చప్పుడు గేటుదగ్గరున్న కారుషెడ్ వేపునుంచి వచ్చినట్లనుమానం కలగటంవల్ల ఆ వేపుకు చూచింది. కాని అక్కడ యేమీలేదు. మెగ్గుతలుపులు యధాప్రకారంగా మూయ్యబడివున్నాయి గేటువెలుపల పోలీసులు డ్యూటీ చేస్తూనే వున్నారు. ఏమయినా గొడవ జరుగుతే అక్కడి పోలీసులకు తెలియదా? షెడ్‌లోపల కారులో పడుకొనే సీనప్ప యివతలకు రాకుండా వుంటాడా? అందువల్ల తనకు కలిగింది వొట్టి భ్రాంతి అయివుంటుందని నిర్ణయించుకొని, తిరిగి యధా ప్రకారమొచ్చి తన గదిలోని పాన్పుమీద వాలింది. నిద్రపట్టించు కోవాలని మళ్ళీ ప్రబల ప్రయత్నం. ఊఁహు! గుడ్లు పొడారి పోయాయి. కంటికి కునుకు రాలేదు.

ఏరోజూకూడా, కుమారికి తనంతట తను నిద్రలేచే అల వాటు లేదు. సరిగా ఆరుగంటలకల్లా సీనప్ప ఆమె గదిలోకొచ్చి మేలుకొలుపుతాడు. ఆమె నిద్రలేచిన తరువాత, టూత్‌పేష్టు, బ్రష్, నీళ్లూ, తువ్వాలు వగైరాలన్నీ అందించి దగ్గరవుండి, ఆమెకు ముఖం కడిగించాలి. ఆ తరవాత కాఫీ తీసుకొచ్చి, తాగే వదున్లో చల్లారబెట్టి ఆమెనోటి కందిస్తాడు. ఆమె కాఫీ తాగ్గానే స్నానానికి నీళ్లూ, సబ్బూ, అన్నీ తయారుచేస్తాడు. కుమారి ఏ సమయంలో ఏదుస్తులు ధరిస్తోందో కూడా సీనప్పకి తెలుసు.

ఆమె స్నానంచేసి వచ్చేటప్పటికి, పెట్టెలోంచి దుస్తులుతీసి డ్రెస్సింగు రూంలో తయారుగా వుంచుతాడు! 'టోయిలెట్' సామానులు ఏమున్నాయో, ఏమి లేవో అతనే చూసుకుంటాడు. పువ్వులు రకాలుకూడా ఆమెకు ఏమిష్టమో అతనికి తెలుసు. మొగ నౌకరయినప్పటికీ, కుమారి విషయంలో దాదా ఆడ నౌకరుగానే పనిచేస్తాడు. చిన్నప్పుడు పాలుపొయ్యటం దగ్గర్నుంచీ కుమారి పనులన్నీ అతనే! ఎత్తుకు పెంచినవాడవటం చేత, యీ రోజువరకూ, ఆమె ఆహారపానీయాలు అభిరుచులు అన్నీ తల్లి రాణియమ్మారావుకంటే, దాదాకే బాగా తెలుసు. అందువల్ల, రాణియమ్మారావు, కుమారి పెంపకం పనులన్నీ యీనాటివరకూ దాదాకే వొదిలింది.

నిత్య రివాజు ననుసరించి కుమారిని మేలుకొలపటానికి దాదా యింకా రానందువల్ల ఆమె మేలుకొని వుండిన్నీ మంచం దిగలేదు. రాత్రంతా నిద్రలేక ఐదలికతో గడపటంచేత, అటూ, యిటూ దొర్లుతూ, కళ్ళు మూసుకునేవుంది. ప్రతిరోజూ అందరి కంటే ముందుగా నిద్రలేచే కుమారి, ఆ నాడింట్లో అందరూ లేచినా ఆమె లేవక పోవడం గుర్తించిన రాణియమ్మారావా గదిముందునుంచి వెడుతూ—

'ఏడు దాటినా యింకా లేవలేదేమమ్మా! దాదా వొచ్చి యింకా మేలుకొలపలేదా? యేపటిపూట?' అంది

ఏడుగంటలయిందని వినేటప్పటికి కుమారి తటాలున మంచం దిగి—

'అబ్బా! యేడయిందా? దాదా యింకా లేవలేదా అమ్మా?' అంటూనే చరచర మేడమెట్లు దిగింది, కారుషెడ్ దగ్గరికెళ్ళడానికి. రోజూ అయిదు గంటలకు నిద్రలేచే దాదా, ఆనాడు ఏడయినా లేవకపోవడం, కుమారికేగాక, యింట్లో అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

'దాదా యింకా లేవలేదా ?' అని కుమారి, దార్లో అపుపించిన ఒకరిద్దరు నౌకర్లనుకూడా అడిగింది.

'లేచిన వెంటనే దాదా ముందర నీవర్శ్యం చేసుకోకుండా వుంటాడమ్మా ?'

అని యితర పరిచారకులు నవ్వుతూ బదులు చెప్పి, ఎవరి పనుల్లో వారు నిమగ్నులయినారు

'ఒకవేళ, ఒళ్ళు బాగుండలేదేమో, లేకుంటే, దాదా ఇంత వరకూ నిద్దరపోడు.'

అని, తనలో అనుకొంటూ, కుమారి వడివడిగా పోయి కారు షెడ్ చేరింది. దానికి వెలుపల తాళం వెయ్యబడి వుండటం చూచి తెల్లబోయింది దాదా అంత ప్రొద్దున్నే లేచి, యెక్కడకు వెళ్ళాడా అనుకొంది. ఒకవేళ వెళ్ళినా. షెడ్‌కు తాళం వెయ్యడే, అని తిరిగి అనుకొని, వడివడిగా లోపలకు వెళ్ళింది.

'దాదా నెక్కడికన్నా పంపించారా అమ్మా ?' అని తల్లి నడగ్గా, ఆమెకూడా ఆశ్చర్యపోయి,

'షెడ్‌లో లేడా ?' అని అడిగింది.

'లేడు—' అంటూనే ఆమె యివతలకొచ్చి యితర పరిచారకుల నందర్నీ దాదాను గురించి అడిగింది. కాని, దాదా యెక్కడికి వెళ్ళిందీ ఎవరికీ తెలీదన్నారు ఆ తరువాత తండ్రిగారుండే ఆఫీసు గదిలోకొచ్చింది. భూపాలరావప్పుడు, ఫోన్‌లో యెవరితోనో మాట్లాడుతున్నాడు. కుమారి ఆపని ముగిసే వరకూ వేచివుండి, ఆయన ఫోన్ క్రింద పెట్టిన తరువాత—

'దాదాని మీరెక్కడికయినా పంపించారా ?' అని అడిగింది.

'నేనెక్కడికి పంపాను ? నేనా !' అన్నాడతను.

'దాదా షెడ్‌లో లేడు. తాళంపెట్టి ఎక్కడికో వెళ్ళాడు.'

'ఏం పనిమీద వెళ్ళాడో, నాకు తెలీదు.'

అంటూ, భూపాలరావు పైమీద కండువా తగిలించుకొని

యివతల కొచ్చేశాడు, తయారుగావున్న తన కారు మీద ఆయన యెక్కడికో వెళ్ళిపోయాడు. కుమారి గేటుదాకా వచ్చి అక్కడ కాపలివుండే రిజర్వుపోలీసుల నడిగింది.

'మా దాదా, యెంతసేపయింది బయటికి వెళ్ళి ?'

'దాదా యెవరూ ?'

'మా దాదా తెలీదా ? ఈ షెడ్‌లో వుంటాడు. మా కారు శుభ్రం చేస్తుంటాడు. రోజూ !'

'ఓ ! ఆ ముసలి నౌఖరు ! అవును. అతనింతవరకూ యివతలకు రానేలేదు. మేమిక్కడే వున్నాం.'

'ఇవతలకే రాలేదా ? రాకపోతే బయట తాళమెలాఒచ్చింది?'

అని ఆమె తెల్లబోయింది, పోలీసు లేంచెబుతారు ? వాళ్లకేం తెలుసు ? కుమారి, ఖంగారుతో మళ్ళీ లోపల తల్లిదగ్గరకొచ్చి,

'ఏమిటే అమ్మా ! దాదా యివతలకూడా లేదట ! బయట తాళామెవరు వేశారు ?' అని అడిగింది.

'బయటకు రాకుండా తాళామెలావుంటుంది ? ఎక్కడికయినా వంపారేమో, మీనాన్నగారి నడిగావా ?'

'అడిగాను. ఆయన యెక్కడికీ పంపలేదన్నారు.' ఆ విషయం రాణియమ్మారావుక్కూడా వింతగానే వుంది.

'దాదా - చెప్పకుండా యెప్పుడూ యెక్కడికీ పోడే !'

'అసలు షెడ్‌లోంచి బయటికి రానేలేదంటే !'

'ఎవరన్నారు ?'

'గేటుదగ్గరి పోలీసులు.'

'వాళ్ళకి తెలీదేమో.'

'అదేమిటమ్మా ! గేట్లో వున్నవాళ్ళకి తెలీకుండా బయటికి పోవడమెల్లా ?'

'అయితే యేమయినాడంటావ్ ?'

'అదే అర్థం కావడంలేదు.'



'ఎక్కడికి వెళ్ళినా రావాలిగా, వస్తాడు. ఆలోపుగా నువ్వు కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీ తీసుకో. దాదా కోసం కనిపెట్టుకుంటే, నీకు కాలేజీ టైమయిపోతుంది.'

'కారు షెడ్‌లోనే వుందిగా ?'

'ఈపూటకి మీనాన్నగారి కారు తీసుకెళ్ళు.'

'ఆయనకూడా కారు తీసుకుని యెక్కడికో వెళ్ళారు. కారు లేకపోతే టాక్సీమీదన్నా పోతాగానీ, దాదా యెక్కడికి వెళ్ళినట్టు ? రోజూ తనేవచ్చి నన్ను నిద్రలేపేవాడు. కాలకృత్యాలకు అవసరమైనవాటి నందించేవాడు. కాఫీ సయితం చల్లారబెట్టి నోటి కందించేవాడు.'

'ఒక్కపూటకి దాదా లేకపోతే గడుపుకోలేవుటమ్మా ?'

'గడుపుకుంటా. ఎక్కడికి వెళ్ళాడా అని.'

'వచ్చాక అడుగుదాం – అతనే చెబుతాడు.'

అని తల్లి చెప్పినమీదట. కుమారి వెళ్ళింది. క్రమంగా కాలకృత్యాలు తీర్చుకుని కాఫీకి కూర్చుంది, వంటవాడిచ్చిన కాఫీని తీసుకోవడానికామె మనస్సంగీకరించలేదు. ఏమిటో ఆందోళన – ఎందుకో ఆరాటం. కాఫీ తీసుకొనేలోపుగా అయిదారుసార్లు షెడ్‌దగ్గరికిపోవటము, దానితాళం దానికి యథాప్రకారముండటం గమనించి, బరువెక్కిన హృదయంతో వెనక్కి రావటము, పదిగంటల వరకూ కాలుకాలిన పిల్లిలాగ మేడపైనించి షెడ్‌దగ్గరికీ, షెడ్‌నుంచి మేడమీదికి తిరగటమే కాని, దాదా రాలేదు. షెడ్ తాళం తియ్యబడలేదు. కుమారి తల్లి దగ్గరికి మళ్ళిపోయి,

'పదిగంటలయిందే అమ్మా ! దాదా రాలేదు. షెడ్ తాళం బద్దలు కొట్టించేదా ?' అని అడిగింది.

'కాలేజీకి టాక్సీమీద పోతానంటివిగా ?'

'అందుకోసంగాదు. దాదా సంగతి తెలుస్తుంది.'

'షెడ్ తాళం బద్దలుకొడితే, దాదా సంగతి యెలా తెలుస్తుంది ?'

'అతనిపెట్టి, బట్టలు, మొదలయిన సామానులు కూడా పట్టుకుపోయాడేమో చూస్తాను.'

'నీగ్గానీ పిచ్చిపట్టిందేం ? ఎనభై యేళ్ళ వయస్సుదాకా మన యింట్లోవున్న దాదా ఈనాడు చెప్పకుండా తన సామానులు పట్టుకుని పారిపోతా డనుకున్నావా ? అతని కటువంటి అవసర మేమొచ్చిందనీ.'

'పోనీ తాళం బద్దలుకొట్టేస్తే నష్టమేముంది ? నాకు కారు కావాలిగా ?'

'సరే, నీయిష్టం.'

అని, తల్లి చెప్పటమే తడవుగా కుమారి అవసరమైనసాధనాలతో యిద్దరు నౌఖర్లను వెంటబెట్టుకెళ్ళి, మోటారుషెడ్ తాళం బద్దలు కొట్టించింది. తలుపులు తెరుచుకొని, తానే ముందుగా లోపల చొరబడింది. దాదా సామాను లేనీ చెక్కు చెదరలేదు. ఎక్కడి వక్కడే ఉన్నాయి. కాని కారువేపు తిరిగి చూచేటప్పటికి ఘోరం ! మహా దారుణం ! కారునిండా రక్తం ! వెనకసీట్లో పడుకున్న దాదా, పడుకున్న పళంగానే హత్య చెయ్యబడి వుండటం గుర్తించగానే,

'దాదా ! దాదాని హత్యచేశారు.'

అని, కుమారి భయోద్రేకాలతో ఒక్క అరుపు అరచి లోపల్నుంచి యివతల కురికింది. విభ్రాంతులయిన నౌఖర్లిద్దరూ. 'అఁ ! అఁ !' అంటూనే షెడ్‌లో చొరబడి కార్లోకి తొంగి చూశారు. ఆ ఘోర భయంకర దృశ్యాన్ని వాళ్ళుకూడా చూడ లేక పోయారు. కారు వెనకసీట్లో నిద్దరోతున్న దాదా నెవరో

కంఠంలో పొడిచి హత్యచేసి నట్లర్థమవుతూంది. పొడిచిన పోటుతో, చిమ్మిన రక్తం, కారు టాపునూ, కుషన్ సీట్లనూ, అద్దాలనూ పిచికారీతో కొట్టినట్లుంది. లోపలకెళ్ళి ఘోర దృశ్యాన్ని చూచిన నౌకర్లిద్దరూ చేతులతో కళ్ళు మూసుకుని యివతలకొచ్చి,

'అబ్బా! చూడలేని మహా ఘోరం! పండినపండు, దాదా లాంటి మంచివాణ్ణి యిలా పొడిచి చంపడాని కెవరికి చేతు లొచ్చాయో!' అన్నారు. ఆమాటతో కుమారి దుఃఖం మరి యెక్కువయింది. చంటిపిల్లలాగ, ఆమె ఒక్కసారి బేరు మంది.

'దాదా! మా దాదానెవరో పొడిచి చంపారు—'

అని గుండె బద్దలయ్యేలా యేడుస్తుంటే, ఆమె యేడుపు విని, గేటుదగ్గర కావలివున్న ఆరుగురు పోలీసులూ ఒక్కసారి షెడ్ దగ్గిరికి పరుగెత్తు కొచ్చారు.

'హత్య! దాదానా?'

అంటూ అందరూ లోపల చొరబడ్డారు. కుమారి యేడుపు విని, భవనంలోని రాణియమ్మారావు, యితర పరిచారకు లందరూ కూడా షెడ్‌దగ్గరికి పరుగులెత్తి వచ్చారు ఒకరు చూచిన ఘోరదృశ్యాన్నే అందరూ చూచారు. ఒకరినోటెంట్భా మాట రాలేదు. రాణియమ్మారావు స్థంభీకృతురాలయింది. కుమారి, ఆపుకోలేని దుఃఖంతో,

'దాదా! దాదా! నన్ను పెంచిన దాదా! అమ్మా నాన్నాల వాత్సల్యాన్ని మరిపించి, యింతకాలం నన్ను సాకావు. నిన్నా హత్యచేశారు! అయ్యో! దాదా! దాదా! ఈదారుణ హత్య నన్నయినా చేశారుగాదు...'

కారుతలుపు తెరుచుకొని, మాసిన గెడ్డంతో పసిదబ్బ పండు లాంటి శరీరచ్ఛాయతో, రక్తప్రవాహాలలో తేలియాడుతున్న

కాడా మీదపడి యేడవబోతుంటే, కుమారిని పోలీసులు వారించారు.

'అధికారు లొచ్చేవరకూ శవాన్ని ఎవరూ ముట్టుకోవొద్దు. ఎలావున్న కారు నలాగే వుంచాలి, కదపకండి,' అన్నారు. షెడ్‌లోని వారిసందర్నీ బయటకు పంపారు. వారిలో ఒకడు కమీషనర్‌గారి ఆఫీసుకు ఫోన్ చెయ్యడానికి వెళ్లాడు. రాణియమ్మారావు గుడ్ల నీరుగక్కుతూ, దుఃఖాతిరేకంవల్ల కూతురుగుండె బద్దలైపోకుండా వుండడానికి సర్వశక్తులూ వినియోగిస్తూంది.

౨

కమీషనర్‌గారి ఆఫీసులో, మహమ్మదాలీగారు, భూపాలరావు, గేలబ్ అముగ్గురూ కూర్చొనివుండి, ఒక ముఖ్యవిషయమును గురించి మాట్లాడు తున్నారు.

'కరెక్టుసార్! కరెక్టు! కుమారికి నన్ను వివాహం చేసుకోవడం పూర్తిగా యిష్టముంది. నేను చెబితే మా బావగారు నమ్మడంలేదు. వార్ని మీరే నమ్మించి, ఒప్పించాలి.'

అని గేలబ్ బల్లగుద్ది చెబుతుంటే,

'నేను:ఆదినించీ, మోడ్రన్‌ప్యూన్ కలవాణ్ణిసార్! ఆసంగతి నా వివాహమే ఋజువుచేస్తుంది,' అన్నాడు భూపాలరావు.

'మీరు రిజిష్టరీ మేరేజి చేసుకుంటే చేసుకొని వుండొచ్చు. కాని, వర్ణాంతర వివాహం కూడా చేస్తారా మీ అమ్మాయికి?' అని కమీషనర్ గారాశ్చర్యంగా అడిగారు.

'అవునుసార్! సంఘంలో మనలాంటి వాళ్ళుం చొరవచెయ్యక పోతే, సంస్కరణలు జరగవు!' అన్నాడు భూపాలరావు.

'కరెక్ట్ సార్! కారెక్ట్! మా బావగారికి కొంచం చాదస్తముంది. అందుకే-' అన్నాడు గేలబ్.

'మీ రాణియమ్మరావుగారు కూడా-'

అని కమీషనర్‌గారు తిరిగి అడగ్గా—

'ఓ! ఆవిడ అభ్యంతరం ఎప్పుడూలేదు' అని కమీషనర్‌గారు భూపాలరావు నడిగిందానికి గేలబ్ బదులు చెప్పాడు.

'నువ్వుండవోయ్! వార్ని మాట్లాడనియ్యి. నువ్వు పోయి నాకో సిగరెట్టు పెట్టి తీసుకురా—'

అని మహమ్మదాలీ, ఆ వొంకమీద, గేలబ్‌ను బయటికి పంపించిన తరువాత-

'ఏ(వి)టిసార్! రత్నంలాంటి మీ అమ్మాయిని, ఈ మూర్ఖుడికిచ్చి పెళ్ళి చేస్తాననటారేమిటి? బావమరదిగదా అని, నేనా అమ్మాయికి ద్రోహం జరుగుతుంటే చూడలేను.'

అని కమీషనర్‌గారు, తమ అభిప్రాయాన్ని ఖచ్చితంగా చెప్పేశారు.

'మీతో బాంధవ్యం కలుపుకొని, సంస్కరణలో ఒక మెట్టు పైకెక్కాలనీ, హిందూ ముస్లిం సఖ్యతకు మనం ఆదర్శం కావాలనీ నా కోరిక' అని భూపాలరావు బదులు చెప్పాడు.

'ఆ రెండు విషయాలూ నాకు తృప్తికరంగా వున్నా-మిస్. కుమారిని నేను చూశాను. ఆమె విద్యా నాగరికతలు గల అద్భుత సౌందర్యవతి. అటువంటి మోహనాంగికి నా బావమరిది లాంటి మూర్ఖుడు భర్తేమిటండీ! వాడసలు పెళ్ళిచేసుకోకుండా వుండాలని, నా వుద్దేశం.'

అని కమీషర్‌గారు చెబుతుండగా-

'కరెక్ట్ కరెక్టు! కుమారిని తప్ప నేనింకెవర్నీ పెళ్ళి చేసుకోను.'

అంటూ, గేలబ్ ప్రవేశించి, తాను కొనితెచ్చిన అగ్గిపెట్టెను బల్లమీద వుంచాడు. కమీషనర్ నవ్వుతూ-

'నిన్నేమిటి తెమ్మన్నాను ఖాయ్ !' అని అడిగాడు.

'అగ్గిపెట్టెకాదా ?' అని గేలబ్.

'ఏమిటిసార్ ! మీరు విన్నారా ? నేను ఏం తెమ్మన్నాను ?' అని కమీషనర్ భూపాలరావు నడిగారు.

'సిగరెట్టుపెట్టి తెమ్మన్నార్లెండి: మర్చిపోయి వుంటాడు' అన్నాడు భూపాలరావు.

'కరెక్టు సార్ ! కరెక్టు ! మర్చిపోయా ! అగ్గిపెట్టె ఎప్పుడూ అవసరమైందేగా ?' అన్నాడు గేలబ్.

'ఇటువంటి మహా ప్రయోజకుడికి మీ పుత్రి నిచ్చి పెళ్ళి చేస్తామంటున్నారు-మీ యిష్టం.'

అని కమీషనర్‌గారంటూ వుండగా, బల్లమీది ఫోన్ రింగ్ చేసింది. ఆయన దానినెత్తి చెవిదగ్గర పెట్టుకొని ఆశ్చర్యంతో అడుగుతున్నాడు.

'ఆఁ ! హత్య ! మేయరుగారింట్లోనా ?'

'అవునుసార్ ! మేయరుగారింట్లోనే-వారి వృద్ధ నౌఖరు దాదాని హత్యచేశారు. ఇప్పుడే ఆ విషయం తెలుసుకోబడింది.'

'సరి-ఇప్పుడే బయలుదేరుతున్నా' నని ఫోన్, రెస్టు మీదుంచి—

'ఏమిటిసార్ యీ ఘోరం ?! మీ వృద్ధనౌఖరు దాదాను ఎవరో హత్య చేశారట-ఆ విషయ మిప్పుడే కనుగొనబడిందట; అక్కడ కావలివున్న పోలీసు ఫోన్ చేశాడు.'

అని భూపాలరావుకు చెప్పగా, ఆయన ఆశ్చర్యంతో—

'ఆరే ! నేనిల్లు బయలు దేరేటప్పటి కేమీలేదే ! అతనుండే కారుషెడ్‌కు తాళంవేసి, ఎక్కడికో వెళ్ళాడని మా కుమారి చెప్పింది సార్ ! ఇది ఆ మరమనిషి దురంతం తప్ప, యింకేమీ కాదండి' అన్నాడు.

'సరే-పదండి-ఆ దారుణమేమిటో చూదాం.'

అని, కమీషనర్ భూపాలరావుతో తక్షణం తన కారుమీద బయలుదేరుతుండగా, గేలబ్ కూడా తయారయినాడు. కమీషనర్‌గా రందు కవకాశమియ్యకుండా కారు డ్రైవ్ చేసుకు పోయారు. కమీషనర్, భూపాలరావుతో- వారి భవనం చేరే టప్పటి కింకా ముందుగానే, సర్కిలు రంగనాథం, యస్. ఐ. శ్యామ్యూలు, మిస్. మేరీజాన్, మొదలయిన పోలీసు అధికారులు కూడా అక్కడ హాజరై వున్నారు. కమీషనర్ వారందరితోనూ, హత్యచేయబడిన వ్యక్తినీ-ఆ స్థలమునూ పరిశోధించి యివతలకు వచ్చిన తరువాత- సర్కిలు, తను సేకరించినంత మటుకు హత్యా వివరాలను కమీషనర్‌గారి కిలా తెలుపుదు చేశాడు:

'దాదా అనే హత్య చేయబడిన యీ వృద్ధనౌఖరు, చిరకాలం నుంచి,భూపాలరావుగారి పోషకవర్గంలో వుంటున్నవాడు.అతను అతి విశ్వాసపాత్రుడు, సద్ధర్ముడు, మిస్. కుమారిగార్ని చిన్నప్పటినుంచీ అతి వాత్సల్యంతో సాకినవాడూ అని తెలుస్తూంది...'

అని సర్కిలు చెబుతుండగా—

'అవునవును, మాకటువంటి నౌఖరు వెయ్యి జన్మలెత్తినా దొరకడు' అన్నాడు భూపాలరావు. సర్కిలు తిరిగి చెబుతున్నాడు.

'గతరాత్రి దాదా, తన యింటి పనులన్నీ అయిపోయిన తరువాత, మామూలు అలవాటు ననుసరించి, ఈ షెడ్‌లో కొచ్చి కార్లోనే, వెనకసీట్లో పడుకొన్నట్లు తెలుస్తూంది. అతను లోపల వున్నప్పుడు, షెడ్ తలుపులు తీసే వుంచుకుంటాడట. రాత్రికి సంబంధించిన వివరాలంతవరకే తెలిశాయి. ఉదయంనుంచీ, షెడ్‌కు తాళం వెయ్యబడివుందట. పదిగంటలవరకూ చూచి, దాదా యెక్కడకు వెళ్ళింది తెలీకపోవటంవల్ల, తన కారుకోసం

మిస్. కుమారి షెడ్ తాళాలు బద్దలు కొట్టించారట. అప్పుడు కారుయొక్క వెనుకసీట్లో హత్య చెయ్యబడ్డ దాదా యొక్క కళేబరం కనుపించిందట.'

'రాత్రి డ్యూటీలోవున్న పోలీసులేమంటారు ?'

'వెలుపలనుంచి ఏవొక్కరూ లోపల ప్రవేశించలేదనీ— భవనంలో వున్నవారే ఈ హత్య జరిగించివుండాలనీ అంటారు.'

ఆమాట విని భూపాలరావు-

'అది చాలా అసందర్భం-భవనంలోని ప్రతివొక్కరూ దాదాని అధికంగా ప్రేమిస్తారు. ఈ దారుణం లోపలివారు చెయ్యడానికి ఆధారాల్లేవు. ఇది మరమనిషిచేసిన ఘోరం తప్ప వేరులేదు' అన్నాడు.

'మరమనిషి మీపై కత్తికట్టాడు కాని, యితరులపై అతని కెటువంటి కార్పణ్యంలేదని మాకు తెలుసు.'

అని శామ్యూలు చెబుతుండగా, కమీషనర్ అతనికి సౌంజ్ఞ చేసి వూరుకోబెట్టాడు.

'లేక ఆత్మహత్య అయివుండాలి.'

అని భూపాలరావు తిరిగి అన్నాడు.

'హత్యకు సంబంధించిన ఆయుధాలేవన్నా దగ్గర వున్నాయా ?' అని కమీషనర్ అడగ్గా—

'ఒక్కటీ లేదు-అది ఆత్మహత్య కాదు.'

అని సర్కిలు అన్నాడు.

'అతని పెట్టెలు వగైరాలు సెర్చి చేశారా ?'

'చేశాం.కొన్ని దుస్తులు-కొన్ని పుస్తకాలు మాత్ర మున్నాయి ఒక పుస్తకంలో యీ ఫోటో దొరికింది.'

అంటూ, సర్కిలు రంగనాథం తాను భద్రంచేసిన ఒక కార్డు సైజు ఫోటోను కమీషనర్‌గారి కిచ్చాడు. ఆ ఫోటోను చూడగా, భూపాలరావుగారి ముఖమెందుకో వెలవెలబోవటమును

పోలీసు అధికారులలో కొందరు కనిపెట్టారు. అది సుమారొక పాతికేళ్ళ వయసులో వున్నట్లున్న ఒక పురుషుని ఫోటో. దుస్తులనుబట్టీ, ఆకారమును బట్టీ, ఆ ఫొటోలోని వ్యక్తి ఒక జమీందారీ కుటుంబానికి చెందినవాడై వుంటాడని ఊహించగలరు. అతను మంచి బలిష్ఠుడుగానూ, స్ఫురద్రూపిగానూ వున్నాడు. వెలిసిపోయివున్న రంగునుబట్టి, అది చాలా సంవత్సరాలక్రితం తీయబడిన ఫొటో అని కూడా తెలుస్తుంది. కమీషనర్ దాన్ని ఆమూలాగ్రం పరిశీలిస్తుండగా, దాని వెనుక పీటీని 'కృష్ణ ఖాను-ది. 15-7-1940' అని కొన్ని అక్షరాలు, అంకెలూ కనుపించాయి. పేరు ఫొటోలోని వ్యక్తిదై వుంటుందనీ, అంకెలు ఆ ఫొటో తియ్యబడిన తేదీనో, లేక ఏదయినా ఒక ముఖ్య సంఘటన్నో సూచించవచ్చుననీ, అందరూ అనుకున్నారు.

'ఈ ఫోటో ఎవరిదండీ?'

అని కమీషనర్ భూపాలరావు నడగ్గా—

'నాకు తెలీదు' అని అతను వెంటనే బదులు చెప్పాడు.

'కృష్ణఖాను-ఆ పేరయినా మీ రెప్పుడూ వినలేదా?' అని కమీషనర్ తిరిగి అడిగాడు—

'లేదు. ఆ ఫోటో దాదా చిన్నప్పుడు తీయించుకున్నాడేమో.'

'అతని పేరేమిటి?'

'మాకు తెలిసినప్పటి నుంచీ సీనప్ప. కృష్ణఖాను అతని చిన్నప్పటి పేరేమో—'

పోలీసు వుద్యోగులు ఎవరూ ఏమీ మాట్లాడకుండా కొద్ది క్షణాలు దీర్ఘంగా ఆలోచించారు.

'మీ రీ ఫోటో నింతకు ముందెప్పుడూ చూడనన్నా లేదా?' అని కమీషనర్‌గారు తిరిగి అడగ్గా—

'లేదు. దాన్ని దాదా పెట్టుకున్నాడని కూడా నాకు తెలీదు.

మీ అందరితోపాటు నేనున్నూ దాన్నిప్పుడే చూస్తున్నాను' అని భూపాలరావు బదులుచెప్పాడు.

'రాణియమ్మారావుగారూ, కుమార్తెగారూ యెక్కడ ?' అని కమీషనర్‌గా రడిగిందానికి ఈ వృద్ధుని దుర్మరణానికి మిస్. కుమారి దుఃఖాన్ని అరికట్టడం అసాధ్యంగావుంది. రాణి యమ్మారావుగా రావిడను ఓదార్చడానికి రాణివాసానికి తీసు కెళ్ళారు.'

అని లేడీ యస్. ఐ. మిస్. మేరీజాన్ చెప్పింది.

'నువ్వు నన్ను వారుండే దగ్గిరికి తీసుకెళ్ళు, మిగతా వాళ్ళం దరూ యిక్కడే వుంటారు.'

అని చెప్పి, కమీషనర్‌గా రొక్కరు మాత్రం లేడీ యస్. ఐ. తో వెళ్ళారు. రాణియమ్మారావు కుమార్తెతో వున్న చోటును పరిచారకుల నడిగి తెలుసుకొంటూ, వారనేకమందిరాలు దాటి, కుమార్తెను పట్టుకొని కూర్చొని, సంత ధారాపాతంగా కారే ఆమె కన్నీళ్ళు తుడుస్తూ, ఊరట వాక్యాలు పలుకుతూ, రాణి యమ్మారావుగారున్న ఒక గదిలో చేరారు. వార్ని చూడగానే రాణియమ్మారావు, కుమార్తెతో లేచి నిలుచోబోగా-

'కూర్చోండమ్మా, కూర్చోండి. మీ బాబా హత్యను గురించి మీవల్ల కొన్ని విషయాలు తెలుసుకోవాలని వచ్చాం.'

అని కమీషనర్, వార్ని నిలుచోకుండా వారించారు. ఒక పరిచారిక, రెండు కుర్చీలు పట్టుకొచ్చి ఆ గదిలో వేసింది. కమీషనర్, లేడీ యస్. ఐ. తో కూర్చున్న తరువాత—

'ఈ హత్యా విషయం చాలా దుర్భేద్యంగా వుంది. మీరు ఆఖరుసారి దాదాను ఎప్పుడు చూశారు ?' అనడిగారు.

'నిన్నరాత్రి పది గంటలకు. అతను యింటి పనులు ముగించు కొని, కుమారికి పక్కవగైరాలు అమర్చి, తాను పడుకోడానికి పోతున్నట్లు నాతో చెప్పిపోయాడు' అంది రాణియమ్మారావు.

'మా దాదాని ప్రాణాల్తో చూడ్డం నాకూ్కడా అదే ఆఖరుసారి. లేదు-దాదా యిక మా కగ్గనుపించడు.'

అని కుమారి, చేతులతో ముఖం కప్పుకొని, వెక్కి వెక్కి యేడవటం మొదలు పెట్టింది.

'అదంతా ప్రయోజనం లేని పనమ్మా! వూరుకోండి' మేరీజాన్ అంది.

'అమ్మాయికి దాదా అంటే ప్రాణం. దీన్ని ఎత్తుకు పెంచిన వాడు దాదా. అందువల్ల, యీ పిల్లనూరుకోబెట్టండ మరీ కష్టమై పోతూందండి' రాణియమ్మారావుగా రనగా—

'ఈ ఫోటో మీ రెప్పుడయినా చూచారేమో చెప్పండి,' అంటూ కమిషనర్ తన చేతిలోని ఫోటోను మేరీజాన్ కీయగా, ఆమె దాన్ని రాణియమ్మారావు కందించింది. ఆమె దాన్ని నిదానించి చూచి, తెల్లబోయిన ముఖంతో—

'లేదు. నాక ఫోటో ఎవరిదో తెలీదు. నేను దీన్నెప్పుడూ చూడ లేదు' అంది.

'నేను చూశాను. ఈ ఫోటో మా దాదా దగ్గరుంటే, నేను నిన్ననే చూశాను. ఎవరిదని అడిగా కూడా, దాదా చెప్పలేదు. తన కంఠంలో ప్రాణముండగా చెప్పనన్నాడు కూడా.'

అని కృష్ణకుమారి తిరిగి యిలా అంది—

'అలా అని, అతనెవరికో ప్రమాణం చేశాట్ట.'

'మీకీ ఫోటో అతని దగ్గర యెలా కనుపించింది ?'

'నేను కారుకోసం షెడ్లో కెళ్ళినప్పుడు దాదా తన పెట్టె సర్దుకుంటున్నాడు. ఆ సందర్భంలో యీ ఫోటో నేలమీద పడి వుంది. నేను దాన్ని తీశాను. దాదా నడిగాను కాని, అతనేమీ చెప్పకుండా ఫోటోను భద్రంగా దాచుకున్నాడు.'

'అప్పుడీ ఫోటోను యింకా యెవరయినా చూశారా అమ్మా ?'

'అదే సమయంలో షెడ్ ముందరనుంచి వెడుతూ మా నాన్న గారు చూసివుంటారేమో.'

ఆ మాట విని మేరీజాన్, కమీషనరూ ఒకరిముఖాల్లొకరు చూసుకున్నారు.

'ఆ ఫోటోకు వెనుకభాగాన 'కృష్ణభాను' అని వ్రాయబడి వుంది చూడండి-మీరా పేరెప్పుడయినా విన్నారా ?'

'లేదు-' అని ముందుగా రాణియమ్మారా వంది.ఆ తరువాత, కృష్ణకుమారికూడా అదేప్రకారం చెప్పింది. ఫోటో తిరిగి కమీషనర్‌గారి చేతి కందజేయబడింది. ఆయన, ఫోటోవేపూ కుమారివేపూ, పదేపదే చూట్టం మొదలుపెట్టారు. ఎందుకో అర్థంగాక మేరీజాన్ తెల్లబోతుండగా-

'వీరివల్ల తెలుసుకోవలసిం దింకేమీలేదు.'

అని కమీషనర్‌గారు లేచారు. వారితోపాటు లేడీ యస్. ఐ. కూడా లేచింది. అప్పుడు రాణియమ్మారావు-

'ఈ హత్యచేసింది కూడా మరమనిషి అయివుంటాడా ?' అని అడగ్గా—

'ఇంతవరకలాగే అనుకుంటున్నాము, అనతికాలంలోనే అచోకీ తిస్తాంలెండి. హంతకు డెక్కడికీ పోలేడు.'

అన్నారు కమీషనర్‌గారు, కుమారి తిరిగి కళ్లనీళ్లు కారుస్తూ—

'హంతకుడు పట్టుబడి యేం లాభం ! ఒకప్రాణి కింకోప్రాణి నష్టపడ్డమేగాని, మా దాదా మళ్ళీ బ్రతుకుతాడా? మా కక్కనబడ తాడా ?' అని యేడ్చింది ఆమెకేమీ బదులు చెప్పకుండా, కమీషనర్‌గారు కిందికెళ్ళిపోయారు. తమ అనుచరులను కలుసుకొన్నారు. భూపాలరావు రాణివాసంలో జరిగిన సంగతులు తెలుసుకోడాని కాదుర్దా పడ్డాడు. కాని, అందు కెటువంటి అవకాశమూ లేకపోయింది. కమీషనర్‌గారు తిరిగి హత్య

జరిగిన కారు షెడ్‌లో ప్రవేశించి, అక్కడి ప్రతి అంగుళమునూ అతి జాగ్రత్తగా పరిశీలించటం మొదలుపెట్టారు. అక్కడొక ట్రంకు పెట్టెమీద రక్తంతోవున్న కొన్నివేళ్ళ గురుతు లాయన దృష్టి నాకర్షించాయి. వాటిని అనుచరులకు కూడా చూపించి, ఆ పెట్టెను భద్రం చేయించాడు. అనంతరం శవమును, అది వున్న కారునూ, ఆ షెడ్‌లోని కొన్ని యితర సామానులనూ, అనుచరుల వశంచేసి, ఆఫీసుకు పంపే యేర్పాటులు చేయించాడు. సర్కిలు రంగనాథంతో కొద్ది క్షణాలేమో ఏకాంతంగా మాట్లాడి వెళ్ళిపోతూ వుండగా భూపాలరావు ఆయనతో కూడా కూడావుంటూ—

'ఈ హత్యకు కారణమయినవాడు పరమనిషి అనడంలో సందేహం లేదు. మీ వుద్దేశ మేమిటి సార్!'

అని కమీషనర్‌గారి నడిగి, జవాబుకోసం ఆదుర్దాగా వేచి వుండగా—

'నేనిప్పుడేమీ చెప్పలేనండి.'

అంటూనే కమీషనర్, తమ కారులో వెళ్ళిపోయారు. భూపాలరావు, సర్కిలు వగైరాల దగ్గర శలవు తీసుకొని వెనక్కు మళ్ళనై వుండగా—

'మీరు కూడా మాతో రావాలి' అన్నాడు సర్కిలు రంగనాథం. అందువల్ల, భూపాలరావు కూడా వారి ననుసరించవలసిన వాడయినాడు.

దాదా హత్య విషయం అశేష జనానికి విషాదకారణమే అయింది. అటువంటి సాధువును హత్య చేసిన ఆ దుర్మార్గుడెవరో కంటబడితే, పోలీసులతోనూ కేసుతోనూ నిమిత్తం లేకుండానే, వాణ్ని ముక్కలుగా నరికి పారెయ్యడాని అనేకమంది వేచి వున్నారు. కాని హంతకుడంత సులువుగా పట్టుబడితే యిక లేనిదేముంటుంది?

# ౬

వేసవికాలం ఆరంభం కావటం వల్ల, సోడాల అమ్మకం యెక్కువయింది. అప్పు తీరటమే గాక, కొంత పైకం కూడా నిల్వచేశారు చంద్రం కొండలిద్దరూ. డబ్బు పెత్తన మంతా చంద్రం మీద పెట్టటం వల్లనే ఆ మాత్రం మంచి జరి గిందని, కొండలయితే సంతోష పడుతున్నాడు గాని, నాగన్నకి మాత్రం గుర్రుగా వుంది. చంద్రం మూలంగా తన తాగుడుకి డబ్బు చిక్కడం లేదని తెలుసుకున్న నాగన్న, మార్గము నాలో చించటం మొదలు పెట్టాడు.

కొండలా రోజున కొట్లకు సోడా లందియ్యడానికి బయటకు బండి తీసుకెళ్ళాడు. చంద్రం యింటి దగ్గరుండి మిషనుకు బుడ్లెక్కించి గ్యాస్ పెడుతున్నాడు. నాగన్న ఏ స్నేహితుడో పోయించిన తాగుడు చుక్కలకై పు ఒంటి కెక్కించుకొని, తూలు కుంటూ యింటికొచ్చాడు. మిషను దగ్గరి చంద్రాన్ని చూడగానే అతని మీదికి దండెత్తాడు.

'పో! నువ్వు మా యింట్లో వుండొద్దు. ఊఁ! పోతావా పోవా?' అంటూ చెయ్యి పట్టుకుని చంద్రాన్ని లాగుతుంటే-

'అయ్యగారి కీ వేళ తాగుడు నీళ్ళెక్కడ దొరికాయీ? ముందర చెయ్యి వొదులు-'

అని చంద్రం గిజాయించుకోడంలో నాగన్న తూలికింద పడ్డాడు. నరాల్లో ఓపిక లేకపోయినా, నోట్లో బలముంది.

'నిన్ను చంపేస్తా-నీ మూలంగానే నా కొడుకు నాకు డబ్బి య్యటం లేదు—'

'ఆఁ! ఆఁ! అలాగే చంపుదువుగాని! నువ్వు చంపినవాళ్లే అక్కడ కుప్పలుగా పడివున్నారు.'

అని, చంద్రం తిరిగి మిషను దగ్గిరి కెళ్లి, సోడాలకు గ్యాసు పట్టుకుంటున్నాడు.

'నా సంగతి నీకు తెలీమరో సెంద్రం! నా కొడుక్కి నాకూ లడాయి పెడతావురా ఖాంఛోత్! నాకు దబ్బు లియ్యకుండా చేస్తావురా బద్మాష్...'

అని, నాగన్న నోటి కొచ్చినట్టు పేలుతుంటే, ఆ తాగినవాడితో యేమిటని, చంద్రం అతనికి బదులు చెప్పకుండా, తన పని తను చేసుకుంటున్నాడు.

'నాగన్న కలుసుకున్నాడంటే నాగకన్నె లేదిగి వొచ్చే ష్టార్! సప్త సముద్రాల్ సారా అయిపోతాయ్. చంద్రమండలానికి నే నెగిరిపోతారో, చంద్రం! హ్హహ్హహ్హ!' అని పిచ్చిధోరణిలో నవ్వటం, లేవబోయి తిరిగి పడిపోవటం ఎన్ని చేసినా చంద్రం పలకటం లేదు. వాగివాగి, మైకం తగ్గాకవాడే వూరుకుంటాడని, చంద్ర మనుకున్నాడు. కాని అలా జరగలేదు. ఉన్న కొద్దీ నాగన్న హంగామా యెక్కువవుతోంది. అప్పుడేమయినా అంటే, పరిస్థితి యింకా అసహ్యంగా మారుతుందని వూహించిన చంద్రం అప్పటికూడా మెదలకుండానే వూరుకున్నాడు.

'నాగన్న-బై ఆర్డర్! ఒరేయ్ చంద్రం! గెటవుట్' అంటూ నాగన్న వున్నట్టుండి, అందుబాటులో వున్న ఒక ఖాళీ సోడా బుడ్డి నందుకొని, చేతికొద్దీ విసిరికొట్టాడు! గోరంత గురితప్పింది కాని, లేకుంటే ఆ దెబ్బకు చంద్రం తల బద్దలు కావలసిందే. ఆ ఖాళీ సోడాబుడ్డి చంద్రం తలకు తగలడానికి బదులు, అక్కడి గోడకు గుద్దుకొని, ముక్కముక్క లయింది. అప్పుడు కూడా చంద్రానికి కోపంరాలేదు. మిషను తిప్పటం మాని, మెల్లిగా వెళ్ళి నాగన్న దగ్గర కూచున్నాడు.

'నన్ను కొడతావా నాగన్న! నీకు నన్ను చంపాలని వుందా? సరే దగ్గరగా వొచ్చాను. కొట్టు చంపు.'

అంటూ తనకు తానుగా శరీరాన్నందించాడు. నాగన్న పిచ్చిగా నవ్వుతూ చంద్రాన్ని కౌగలించుకొని-

'మైడియర్ చంద్రం! నిన్నెందుకు చంపుతారా? నిన్నెందుకు కొడతారా? నా కిప్పుడు ఒక్క రూపాయి కావాలి-ఇస్తావా? చస్తావా? చెప్పు-చెప్పు.'

అంటూ చంద్రం చొక్కా పట్టుకున్నాడు.

'ఒక్క రూపాయికాదు-పదిరూపాయ లిస్తాను. ఇస్తే, ఏం చేస్తావు?'

'ఏం చేస్తాను? తాగుతాను. ఖుషీ కుషీ. జల్ కుషీ చేస్తా— నువ్వుకూడా తాగాలి. తాగనంటే చంపుతాను. తాగుతావా తాగుతావా!'

అంటూ నాగన్న, చంద్రం చొక్కా పట్టుకుని గుంజుతున్న సమయంలో, గుమ్మంఁదగ్గిర ఆగిన కార్లోంచి మిస్. కుమారి దిగింది. లోపట్నుంచే ఆమెను చూచిన చంద్రం, గబగబ యివతలకు పరుగెత్తుకొచ్చాడు. అప్పుడామె కళ్ళల్లో నీళ్ళుండటం చూసి, అతను తెల్లబోయాడు. ఆమె ఆ విధంగా తమ యింటికి రావటం చాలా తప్పు అని గట్టిగా చెప్పాలనుకున్నాడు. కాని ఆమె కళ్ళప్పటికే నీటితో నిండివుండటం తిలకించి ఏమీ మాట్లాడలేకపోయాడు. లోపలికి తీసుకెళ్ళి కూచోబెడదామంటే, అక్కడి నాగన్న తాగిచేస్తున్న హంగామా ఆమె చూస్తుంది; అందు కతని ష్టపడలేదు. తనే యితవలకొచ్చి, కారు వేపు నడిచాడు. ఆమెకూడా అతనితో వచ్చింది. ఇద్దరూ కారు దగ్గర నిలుచున్నారు.

'నాకేమీ అర్థం కావటం లేదండి-ఇక్కడి కెందుకొచ్చారు? కంట తడిపెట్టుకోవటం దేనికి?'

'చంద్రం!'

ఆమె గొంతుక శోకంతో పూడుకుపోయింది. మళ్ళీ తెపుల్చుకుని—

'మా దా దా-దా దా ని హత్యచేశారు-తెలుసా ?' అంది వొణుకుతున్న గొంతుకతో.

'దాదానా ? హత్యచేశారా? దాదా అంటే ఆ ముసలినౌఖరు. మీ అమ్మగారి పుట్టినదినం పండుగలో చూశాను. దాదా చాలా మంచివాడు. అతన్నే హత్యచేశారు ?'

'అవును చంద్రం ! దాదా నా ప్రాణంలాంటివాడు.'

'అరరే—అతన్నెవరు హత్యచేశారు ?'

'మరమనిషే అనుకుంటున్నా. ఈ వేళ్టికి మూడు రోజు లయింది. నా మనస్సంతా వికలమై పోయివుంది చంద్రం ! నీతో కొంచం సేపు మాట్లాడితే నా దుఃఖం తగ్గినట్టుంటుంది.'

చంద్రం బదులు చెప్పలేదు.

"మా నాన్నగారు ఏమో అన్నారని మనసును కష్టపెట్టు కున్నావు. నా ముఖంచూసి నీ మనసులో కష్టం పోగొట్టుకోవాలి.'

చంద్రం వింటున్నాడు.

'బదులు చెప్పకుండా నాతో రా—దాదా హత్యవల్ల కలిగిన దుఃఖం నీవల్ల తగ్గాలి. నువ్వు సంతోషంగా మాట్లాడితే నేను దుఃఖమంతా మర్చిపోతాను. వొస్తావా నాతో.'

'ఎక్కడికి ?'

'మాయింటికొద్దు-పార్కులోకి.'

'మీ మేలుకోరి చెబుతున్నాను. మీరునాతో ఎక్కువ మాట్లాట్టంగాని,నన్ను తరుచు కలుసుకోవటంగాని మంచిదికాదు.'

'నువ్వటువంటి మాటలంటే, నాకు దుఃఖమింకా పొంగి పొర్లుతుంది. మారు చెప్పకుండా కారులో యెక్కుతావా ?'

'ఈ ఒక్కసారి మీరు చెప్పినట్లు వింటాను. మళ్ళీ యెప్పుడూ- '

'అబ్బబ్బ ! ఇప్పుడేం చెప్పకు చంద్రం! నన్నేడిపించొద్దు.' తిరిగి ఆమె ముఖం దుఃఖపూరితమవుతుండడం గమనించిన

చంద్రం, బదులు చెప్పకుండా కారులో యెక్కి కూర్చున్నాడు. ఆమె శాంతించిన హృదయంతో కారు డ్రైవ్ చేసుకుపోయింది.

చంద్రానికి కారెక్కటం అది మొదటిసారి. ఆ పనీ అంత రాత్మ ఎంతమాత్రం అంగీకరించటంలేదు. అది తన తాహతుకు మించిన పని అని ఆతనికి తెలుసు. అయినా ఆత్మీయుని హత్య వల్ల అధోలోకానికి కుంగిపున్న ఆమె, తనవల్ల యింకా దుఃఖ పడటం అతను సహించలేకపోయాడు. ఆమె చెప్పినట్లు విన్నాడు. కారు క్రమంగా పార్కు చేరింది. ఇద్దరూ దిగారు. లోపలి కెడుతుండగా గేటుదగ్గర గేలబ్ హాజరయ్యాడు.

'హల్లో మిస్. కుమారి !'

అంటూ అతనే ముందుగా పలకరించేటప్పటి కామె గుండె గుభేలుమంది. ఆమె పలక్కపోయినప్పటికీ అతను వారి ననుస రించి లోపలికొచ్చాడు. అందువల్ల కుమారి, నిలువునా నీరయింది.

'మీ దాదాని హత్యచేశారని విన్నాను.'

'ఆc!'

అని ముక్తసరిగా బదులుచెప్పి, ఆమె చంద్రంతో ముందుకు సాగిపోతుంటే, గేలబ్ వార్నే అనుసరించాడు. ఎవరో పెద్దమనిషి చూస్తుండగా, తానామెతో వున్నందుకు చంద్రం అభిమాన పడు తున్నాడు. కుమారి గౌరవానికి భిన్నం కలిగించుకొంటూందను కున్నాడు. అప్పటికయినా ఆమెను వొదిలిపెట్టి వెళ్ళిపోతే మర్యా దగా వుంటుందనుకున్నాడు.

'హస్తా' అని తటాలున చంద్రం వెనక్కు మళ్ళగా-కుమారి తెల్లబోయింది.గేలబ్ యెదురుగా ఏమనడానికి వీల్లేక దీనమయిన కళ్ళతో చంద్రం ముఖంలోకి చూచింది. చంద్రం ఆమె చూపుల్ని లెఖ్కచెయ్యకుండా, వడివడిగా వెళ్ళిపోయాడు.

'మిస్టర్ చంద్రం నాకు తెలుసు! చురుకుగల అందమైన కుర్రాడు! కరెక్టు! కరెక్టు'

అని గేలబ్ అనగా, కుమారి, ముఖం చిట్లించుకుని, తను కూడా కారు దగ్గరికి వెనక్కు మళ్ళింది. గేలబ్ ఆమె ననుస రించాడు. మార్గంలో ఆమె అతనితో పలక్కపోయినా—

'పార్కులో కొంచం సేపయినా వుండకుండా వెళ్ళిపోతు న్నారు. కరెక్టు! కరెక్టు! తొందర పనులేవో వుండివుంటాయి.'

కుమారి అందుక్కూడా బదులు చెప్పకుండా, చరచర పోయి తన కారులో కూర్చుంది. కారు తక్షణం స్టార్టుచేసి వెంటనే పరుగెత్తించింది. అందును గురించి మూర్ఖుడయిన గేలబ్ ఏమనుకున్నదీ ఆమె కవసరం లేకపోయింది. కాని ఆ నాడు చంద్రంతో ఏమేమో చెప్పుకోవాలనుకొన్న ఆమె ప్రయత్నం విఫలమయినందుకు కామె యెక్కువగా విచారించింది. అతని ముందు తన హృదయం విప్పి గుమ్మరించాలనుకొంది-మనసు లోని గుబులు నంతటినీ వెళ్ళగక్కి భారం తీర్చుకోవాలను కొంది. తండ్రి అతని మనసులో నాటిన బీద గొప్పల వ్యత్యాస విషబీజాన్ని మొదలంట ఊడబెరకా లనుకొంది. వ్యక్తులు అంతస్తు తేడాలు నిర్ణయించడానికి డబ్బు కొలబద్ద కాకూడ దన్న సత్యాన్ని అతనికి నచ్చచెప్పాలనుకొంది. కాని ఆమె తల చిందొక్కటీ జరగలేదు. అంతరాయం కలిగించ డానికా గేలబ్ సైంధవుళ్ళా అడ్డమొచ్చాడు. అందుకామె అతన్ని వెయ్యివిధాల తనలో తాను శపించుకొంటూ కారును డ్రైవ్ చేసుకుపోయింది.

౭

ఎర్ర సిరా వుత్తరం అందినప్పట్నుంచి, మేరీజాన్‌కు గుండెల్లో అదటుపుట్టింది. ఆమెతోపాటు అటువంటి వుత్త రాలే, కమీషనర్‌గారికీ, యితర ముఖ్య పోలీసుద్యోగులకూ

అందజెయ్యబడ్డాయి. కాని, వారెవరికీ అటువంటి అవటు పుట్టక పోగా, అనేక సాహసాలుచేస్తున్న మరమనిషి విషయం తెలుసు కోవాలన్న కుతూహలము, పట్టుదల, వారి కెక్కువయింది. ఎర్ర సిరా వుత్తరం అందుకోనంతవరకూ, లేడీ యస్. ఐ. కూడా అలాగేవుంది. ఆ కేసులో కష్టపడి పనిచేస్తే, పై గ్రేడ్‌కు పోవచ్చునని ఆశపడింది. కాని ఎర్ర సిరా వుత్తరంతో ఆమె ఆశలు నీళ్ళు కారాయి.

హోటల్లో కాఫీ తాగుతుంటే, తనకు తెలీకుండానే తన జేబులోకా యెర్ర సిరా వుత్తర మెచ్చిపడింది. మరమనిషి మాయాజాలం ఋజువు కావడాని కంతకంటే యింకేం కావాలనుకొందామె. అతను ఎర్ర సిరా వుత్తరంలో రాసిన ప్రకారం, అక్షరాలా జరిగించి తీరతాడని భయపడింది. అందుకుతోడు, దరిమిలా జరిగిన వాదా హత్య! ఇతరుల అభిప్రాయాలు ఎలా వున్నా, ఆ హత్యా క్రియ మరమనిషివల్లనే జరిగివుంటుందని ఆమె నమ్మింది. తనకు కూడా అటువంటి గతే పడితే? ఆమె అనుక్షణం, అలాగే అనుకుంటూంది. కమీషనర్‌గారితో చెప్పి తనకా మరమనిషి డ్యూటీలేకుండా చేసుకోవాలన్న ప్రయత్నంలో వుందామె కాని, తన పిరికితనం బయటపడితే అవమానమన్నది మరొక సమస్య. కొంతకాలం, అనగా—మరమనిషి సమాచారం తేలపోయేవరకూ శలవులో వుండటం మంచిదని నిశ్చయించు కొని, మిస్. మేరీజాన్ దరఖాస్తుపెట్టి మూడు దినాలయింది. కాని అంతవరకూ శలవు గ్రాంటు కాకపోవటమును గురించి ఆమె ఖంగారు పడుతూంది.

కారు షెడ్‌లో జరిగిన హత్యను కళ్ళారా చూచినప్పట్నుంచి, లేడీ యస్. ఐ. గుండె మరింత బేజారైపోయింది. తను పోలీసు డ్యూటీలో ప్రవేశించిన అయిదేళ్ళ సర్వీసులోనూ అటువంటి దారుణ సంఘటన నెప్పుడూ చూడలేదు. ఆ రక్తపు

కొల్లు! ఆ భయంకర దృశ్యం—ఆ రోజు మొదలు కళ్ళకు కట్టి నట్లె వుంటున్నాయి. అన్నహితవుపోయి, ఆ దృశ్యం హృదయానికి తట్టినప్పుడల్లా ఆమెకు గుండెలు వేగంగా కొట్టుకుంటాయి. చోరీ నేరాలు కొన్నిటిలో పనిచేసింది—న్యూసెన్సు కేసులు కొన్ని పట్టుకొంది. ఆమె కెప్పుడూ యింత భయంకాని, అదటుకాని పుట్టలేదు. ఉపరి మరమనిషి ఎఱ్ఱ సిరా పుత్తరం ఆమెకూడా చేరింది. దాంతో ఆమెకు హడల్! మరమనిషి పేరు చెబుతే భయోత్పాతం కలిగింది, కమీషనర్‌గారి ఆఫీసన్నా-మరమనిషి కేసన్నా, మిస్ మేరిజాన్‌కు జంకుపుట్టింది. ఉద్యోగంలో వుండి, తప్పించుకు తిరగడమెలా?

కమీషనర్‌గారి దగ్గర్నుంచి కబురు రాగానే ఆమె గుండెల్లో దడపుట్టింది. అయినా విధిలేక బయలుదేరింది. కమీషనర్‌గారప్పుడాఫీసులో ఒంటరిగా వున్నందుకు కొంత సంతోషించి, లోపల ప్రవేశించి నమస్కరించింది. కమీషనర్ ఆమె శలవు దరఖాస్తును తీసి—

'మీరు శలవు దరఖాస్తు పెట్టారుగాని, ప్రస్తుతం వీల్లేదు. అయినా మీ కిప్పుడు శలవు—మూడు మాసాలు దేనికి? మరమనిషినిగురించి భయంగావుందా?' అని అడిగారు.

'అబ్బెబ్బె! భయమున్నవాళ్ళు పోలీసు డ్యూటీ కెందుకు పనికొస్తారు సార్!'

'ఎఱ్ఱసిరా వుత్తరానికి బెదురుతున్నారేమో ననుకుంటున్నా.'

'అటువంటిదేమీ కాదు సార్! మరమనిషిని నేనే పట్టి, గ్రేడ్ పొందాలని చాలా ఉత్సాహపడుతున్నాను. కాని, శరీరారోగ్యం బాగా లేకపోవటంవల్ల శలవు రాశాను.'

'ఆరోగ్యం బాగాలేదా? మరమనిషి గందరగోళం చల్లారే వరకూ ఎవరికీ శలవుగ్రాంటు చేసేదానికికాదు. మీ ఆరోగ్యం అంతగా బాగుండకపోతే, డిపార్టుమెంటు లేడిడాక్టరుచేత

పరీక్ష చేయించి, ఒకటి రెండు వారా లుమాత్రం శలవు తీసుకో వచ్చు.'

ఆ మాట వినగానే, మేరీజాన్‌కు గుండెల్లో మరో రాయి పడింది. డిపార్టుమెంటు డాక్టరసలే చండ శాసనురాలు. ఆవిడ, జబ్బులేకుండా, 'సిక్‌లీవు' సిఫార్సు చెయ్యడం అన్నిటికంటే అసంభవమని తెలుసుకొన్న లేడి యస్. ఐ. ఏం చెయ్యడానికి పాలుపోక, దిక్కులు చూస్తున్న సమయంలో-

'ఏమంటారు? లేడీడాక్టరు దగ్గిరికి పోతారా?' అని కమీషనర్ అడిగారు.

'ప్రస్తుతం వొద్దులెండి-అంతగా అవసరమైనప్పుడు చూసు కొంటాను.'

'వెరీగుడ్! చేతలు తక్కువగావున్న సమయంలో మీలాంటి సమర్థులు శలవలు తీసుకొంటె పనులెలా జరుగుతాయి?'

మేరీజాన్ బదులు చెప్పలేదు.

'మరమనిషి విషయంలో మీరు దరిమిలాచేసిన కృషి యేమిటి?'

'నాలుగు రోజులనుంచి ఒంట్లో బాగా వుండడంలేదని మనవి చేశానుగదా సార్!'

'మనమందరం కలిసి కొంచం గట్టి ప్రయత్నం చెయ్యకపోతే లాభంలేదు. ఇప్పటికే ఒక హత్య జరిగింది, ఇంకా యెన్ని హత్యలు జరుగుతాయో!'

'అదే నాకూ భయంగా వుంది సార్!'

'పోలీసు డ్యూటీచేస్తూ భయపడితే యేంలాభం? అవసర మొస్తే ప్రాణానిక్కూడా తెగించాలి. ఒక మరమనిషికాదు— వంద మరమనుషు లెదురయినా ధైర్యంగా పోరాడాలి.'

అని, కమీషనర్‌గారు చెబుతున్న మాటలు వింటూంటే లేడీ యస్. ఐ. ఒంటికి ముచ్చెమటలూ పోశాయి. అప్పటికామె

వారిదగ్గర శలవు తీసుకొని వచ్చేసింది. కమీషనర్‌గారు చెప్పిన మాటలే మళ్ళీ జ్ఞాపకం చేసుకుంటూ, ఉపాయాంతరమును గురించి యోచనచేస్తూ వస్తుండగా, వెనుకనుంచి యెవరో చప్పట్లు చరిచినందు వల్ల. పరధ్యానంలో వున్న మనిషి ఉలికిపడి వెనుదిరిగింది. అతను గేలబ్! అతని నామె అంత ర్యంలో అసహ్యించుకొంటున్నప్పటికీ, కమీషనర్‌గారి బావ మరది అయిన కారణంవల్ల, తప్పనిసరిగా నిలవాలసొచ్చింది.

గేలబ్ క్రమంగా ఆమెను సమీపించి—

'యస్. ఐ. గారు నడిచి వెడుతున్నారు! కారు రిపేర్లో వుందని చెప్పారు కాదూ? కరెక్టు! కరెక్టు!'

'ఇప్పుడు నాతో మీకేమయినా పనుందా?'

'కరెక్టు! మంచి ప్రశ్న అడిగారు. మీకు తెలుసుగా—నాకు మేరేజ్ కాబోతూంది.'

'మీకా? మేరేజ్!'

'కరెక్టు! కరెక్టు! నాకే!'

'ఎవరా అభాగ్యురాలు? అహహ! భాగ్యవతి!'

'మిస్. కుమారి! భూపాలరావుగారి కూతురు!'

'ఆఁ!'

'కరెక్టు! కరెక్టు!'

'సర్లెండి—వొస్తా...'

'మరొక్క మాట! నాకు మరమనిషి కనుపించాడు!'

ఆమె అదిరిపడింది.

'మీకు మరమనిషంటే భయంలా వుందే!'

'నో! నో! నాకెప్పుడూ భయంలేదు. అటువంటి మనుషుల్ని లక్షమందిని చూశాను.'

'కరెక్టు! కరెక్టు! న్యూస్ పేపర్లనిండా ఆ బొమ్మలేగా! చూసివుంటారు!'

'థాంక్సు! శలవు, మళ్ళీ కలుసుకుందాం.'

'మరొక్క మాట! మీకింకా పెళ్ళికాలేదు గదూ! మరమనిషి పోలీసుద్యోగు లందరిమీదా నిగా వేశాడంటున్నారు. కొంచం జాగ్రత్తగా వుండండి! ఎర్ర సిరా వుత్తరం-మీక్కూడా...'

'అఁ! అ! మరమనిషి ఎర్ర సిరా వుత్తరంలో రాసిన విధంగా చేస్తాడఁటారా ?'

'కరెక్టు! కరెక్టు! కారు షెడ్‌లో హత్య! చూశారుగదా !'

ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

'మీకు మరమనిషి కనుపిఁచాడంటిరి గదా ? ఎక్కడ ? ఎప్పుడు ?'

'ఒక అరగంట అయింది. పక్కవీధిలోంచి రయ్యన చక్రాల కాళ్ళతో పరుగెత్తి పోతుంటే చూశాను. నేనేకాదు-ఇంకా అనేకమంది చూశారు. సిటీపోలీసులు కార్లమీదా, మోటారు సైకిళ్ళమీద, రివాల్వర్లు, తుపాకులూ పట్టుకు పరుగెత్తారు. ఆ తరవాత, యేమయిందో తెలీదు. మరమనిషి యెప్పుడూ యిలాగే చేస్తున్నాడు. హఠాత్తుగా కనుపించడం-పోలీసులు ఈలలూది, పదిమంది చేరేటప్పటికి వాడు తూనీగలాగ తుర్రుమని పారిపోవటం, జరుగుతూంది.'

'వాణ్ణలా పారిపోనివ్వకూడదు. నేనుంటే ఒక్క రివాల్వరు దెబ్బతో పడగొట్టేదాన్ని! అదీగాకపోతే తాళ్ళతో బంధించి, స్టేషనుకు లాక్కుపోయేదాన్ని! లేకుంటే, ఒక్క కత్తివేటుతో రెండుగా నరికి పారేసేదాన్ని.'

'అదుగడుగో! మరమనిషి! మీ చంకలో రికార్డు లాక్కుపోతున్నాడు! కరెక్టు! కరెక్టు.'

అని గేలబ్ అన్నది నిజమే. అప్పటికప్పు డెక్కడనుంచి అవతరించాడో-ఏమూలనుంచి పుట్టుకొచ్చాడో, వచ్చిరావడంతోనే లేడీ యస్. ఐ. మిస్ మేరీ చంకలో వున్న రికార్డు కట్ట నూడ

లాక్కోవడము మేఘాలమీద యెగిరిపోయినట్లు చక్రాల కాళ్ళ మీద తుర్రుమనటము-అంతా కన్నుమూసి తెరిచేలోపుగా అయిపోయింది. మేరీజాన్ ఒకవేపు-గేలబ్ ఇంకోవేపు చేష్టలుదక్కి, కొయ్యబొమ్మల్లా నిలుచోటంకంటే యింకేమీ చెయ్యలేక పోయారు.

ఆ తరువాత, అందరు పోలీసులూ మూగారు, అట్టహాసాలన్నీ చేశారు. వీధులనిండా మోటార్ల పరుగులు—ఈలల కూతలు-అంతే మిగిలింది కాని, ప్రయోజనం నాస్తి!



ఇంగ్లండులో అయిదు సంవత్సరాలుండి, అక్కడ సి. ఐ. డి. శాఖలో ప్రత్యేక తరిఫీదునుపొంది, తిరిగి వచ్చిన మున్షిబాబుకి స్వదేశంలో అడుగుపెట్టగానే చేతినిండా పని కలిగింది. అతను బొంబాయిలో సాధారణ యస్. ఐ. గా వుంటూ, పోలిసు డిపార్టుమెంటుకు చేసిన అమోఘమయిన సేవలకు ఫలితంగా, ప్రభుత్వమతన్ని పరిశోధనా పద్ధతులలో ప్రత్యేక తరిఫీదు పొందడానికి విదేశం పంపటం జరిగింది. అతను తిరిగిరావటమే తడవుగా, మరమనిషి పరిశోధనల నిమిత్తం, బొంబాయినుంచి విశాఖపట్నం పోస్టు చెయ్యబడ్డందుకు కమీషనర్ మహమ్మదాలీ, సర్కిలు రంగనాథం మొదలయిన శాఖోద్యోగులందరూ అమితమయిన ఉత్సాహమును పొంది, ఆయనకు సుస్వాగతము లిచ్చారు. అయితే, మున్షిబాబుసంగతి, ఒకరిద్దరు ప్రధానోద్యోగులకు తప్ప ఇతరులకు తెలియకుండే లాగున అతి గూఢంగా వుంచబడింది. కమీషనర్‌గారింటి దగ్గర కొన్నివేళలందు మాత్రం ఆయన్ని కలుసుకొని, అవసరమయిన విషయాలు రహస్యంగా మాట్లాడి వెళ్ళిపోవటం జరుగుతూంది. సర్కిల్, రంగనాథానికి, కమీషనర్ మహమ్మ

దాలీకి తప్ప, యితర పోలీసుద్యోగులకే తెలియని మున్షీ బాబు సంగతి, యితరుల కెలా తెలుస్తుందీ.

మున్షీబాబు సుమారు నలభై సంవత్సరాల వయస్సులో నల్లగాను, చూపులకు పరమ అసహ్యంగానూ వుంటాడు. పొట్టి ఆకారము-తీరవులేని అవయవాలు-బట్టతల కలిగి, అతి నిరాడంబరంగా వుంటాడు. బిళ్ళ పంచకట్టు, బెంగాలీలాల్చి మొదలయిన దుస్తులనుబట్టి మాత్రం, అతనే జాతివాడయిందీ తెలుసుకోవచ్చు. ఆకారమెలావున్నా, అతని అఖండమయిన తెలివితేటలవల్ల, సాధారణ ఇన్‌స్పెక్టరుగా వుంటూచేసిన, అనేకములయిన ఘనకార్యాలవల్ల, ప్రభుత్వ ఆదరాభిమానాలూ సహకారాలూపొంది, విదేశంలో పరిశోధనశాఖకు సంబంధించిన పరీక్షల్లో వుత్తీర్ణుడై ప్రత్యేక నైపుణ్యమును సంపాదించుకొచ్చాడు.

అతని సహకారంవల్ల, నిగూఢమయిన దాదా హత్య విషయము, మరమనిషి సమాచారములూ కూపి తియ్యబడవచ్చునని, అతని సామర్థ్యములు తెలిసినవారందరూ ఆశిస్తున్నారు.

ఆ నాడు, మహమ్మదాలీ, మున్షీబాబు లిద్దరూ, ఇంటి దగ్గరక్కూడా రాకుండా సముద్రపొడ్డున కలుసుకున్నారు ముందుగా మున్షీబాబేవచ్చి సాంకేతిక స్థలం దగ్గర పదినిమిషాలు వేచివున్న తరువాత, మహమ్మదాలీ పాద చారిగావచ్చి అతన్ని కలుసుకున్నాడు. పరస్పర కరస్పర్శలు చేసుకున్న తరవాత, ఇద్దరూ మౌనంగా మరకొంతదూరం నడచివెళ్ళి, ఒక రేవులో వున్న .స్టీంబోటులో యెక్కి కూర్చున్నారు. అది వారికోసమే అక్కడ ఏర్పాటు చేసుకోబడి వుండటంవల్ల, అందులో యింకెవరూ లేరు.

'బోటును నడుపుకోగలిగితే, మనం మాటలాడుకొంటూనే కొంత దూరం షికారుగా పోయివుందుం.'

అని మహమ్మదాలీ అన్నదానికి—

'నేను నడుపుతాగా ?' అన్నాడు మున్షీబాబు వెంటనే.

'అవునవును. మర్చిపోయా ! ఇంకా యెన్ని విద్యలు నేర్వక పోతే, పరిశోధనశాఖకు పనికివస్తారు. మన సర్కిలుగారు కూడా రానియ్యండి-సరదాగా కొంతదూరం పోయివద్దాం.'

'ఆయన, తమతో యెవర్నో వెంటబెట్టుకు రావాలన్నారు.'

'అవును. చంద్రం అనే ఒక సోడాలమ్ముకొనే కుర్రాడు. చూశారంటే మీరతన్ని అతిగా మెచ్చుకుంటారు. అఖండ మయిన తెలివిగలవాడు. సాహసవంతుడు. ఆదిలో మరమనిషి సంగతి మాకు వాడివల్లనే తెలిసిందనీ, అందుకు వాడికి రివార్డిచ్చామనీ పనవి చేశాను.'

'ఆఁ! జ్ఞాపకముంది.'

'వాణ్నే, మన సర్కిలుగారిప్పుడు వెంటబెట్టుకు రాబో తున్నారు. వాడు మీకన్ని విషయాల్లోనూ సహకారిగా వుంటాడు. ఇంకో ముఖ్యవిషయమేమిటంటే, మేయరు భూపాల రావుగారి కూతురు, మిస్. కుమారి, ఆ కుర్రాణ్ని ప్రేమిస్తున్న దనీ, తరుచు ఆ యిద్దరూ రహస్యంగా కలుసుకుంటున్నారనీ, మన సర్కిలు రంగనాథంగారు యిటీవల తెలుకొన్న కొత్త విషయం, కనుక మనమా చంద్రంవల్ల వీలయినన్ని భోగట్టా సంపాదించుకోవచ్చు.'

అని, కమీషనర్ చెప్పిన దానిని మున్షీబాబు అవగాహన చేసుకున్నాడు. అంతవరకూ మరమనిషి జరిగించిన అద్భుత సాహసకార్యాలతో పాటు, భూపాలరావుయొక్క కుటుంబ చరిత్ర కూడా, మున్షీబాబు కింతకుముందే వివరంగా తెలుపబడి వుండటంచేత, అతను చంద్రాన్నిగురించి అవలీలగా అవ గాహన చేసుకున్నాడు. అతనివల్ల తమకు కొన్ని వుపకారాలు కూడా జరగవచ్చునని అంగీకరించాడు.

ఆ తరువాత, కమీషనర్, దాదా హత్యకు సంబంధించినవీ మరమనిషికి సంబంధినవీ, తామంతవరకూ సంపాదించిన కొన్ని కాయితాలను మున్షీబాబు ముందరపెట్టి, యిలా అన్నాడు!

'విషయాలన్నీ మీ కా మూలాగ్రంగా యిదివరకే తెలువ బడ్డాయి. దాదా హత్య సందర్భంలో మేము సెర్చి చేసినప్పుడు దొరికిన ఫోటో ఒకటి-మరమనిషీ మాకు రాసిన ఎఱ్ఱ సిరా వుత్తరాలు కొన్ని, ఈ రికార్డుల్లో పున్నాయి. రాణియమ్మా రావు, భూపాలరావు గార్లిచ్చిన స్టేటుమెంట్సు, యస్. ఐ. లు ఎప్పటికప్పుడు రాసుకొన్న డైరీనోట్సు-యింకా మరికొన్ని కాయితాలు, మరమనిషి, మిస్. మేరీజాన్ స్వాధీనంలో వుండగా అపహరించుకుపోయాడు.'

మున్షీబాబు, కమీషనర్ చెబుతున్న దానిని వింటూనే, తన కియ్యబడిన కాయితాలను పరిశీలిస్తూ, అందులో వున్న ఫోటోను చూచి విభ్రాంతుడయినాడు. దానికి వెనుక పీటీను 'కృష్ణభాను-ది. 15-7-1940' అని వ్రాయబడివున్న అక్షరాలను, అంకెలను తిలకించి, మరింత తెల్లబోయాడు.

'ఆ ఫోటోనుబట్టి మీకేం తెలిసింది? అలా తెల్లబోతున్నారెందుకు?'

అని, కమీషనర్ అడిగిందానికి, మున్షీబాబు ఒక నిట్టూర్పును విడిచి—

'ఈ ఫోటోలో వున్న వ్యక్తి ఒక హంతకుడు-కేసు జరుగుతుండగా, ఖయిదులోనుంచి పరారి అయిన నేరస్తుడు!'

అని మున్షీబాబు చెప్పినదానిని విని, కమీషనర్ కూడా విభ్రాంతుడయ్యాడు.

'దాదాకూ, ఈ ఫోటోలోని హంతకుడికీగల సంబంధమేమై వుంటుంది?'

'బంధువో-కొడుకో అయివుండవచ్చు.'

'అయితే, తమ యింట్లో చిరకాలంనుంచి వుంటూవున్న దాదా కాక ఆత్మీయుడున్నాడనీ-ఈ ఫొటో అతనిదేననీ, భూపాల రావుగారి కుటుంబంలో ఒక్కరికి తెలియకుండా వుంటుందా ? ఆ ఫొటోగాని, ఆ ఫోటోలోని వ్యక్తిగాని, తమ కసలు తెలియనే తెలియదని వారెందుకు చెబుతారు ?'

మున్షీబాబు కొంచ మాలోచించి—

'రాణియమ్మారావుగారికి బొంబాయిలో కూడా ఒక స్వంత భవనముందన్న విషయం మీకు తెలుసునా ?'

'నాకు తెలియదుగాని, వుండవచ్చు. మద్రాసు, కలకత్తా ల్లాంటి ప్రతి ముఖ్యనగరంలో వారికి స్వంత భవనాలున్నాయని రికార్డులోవుంది.'

'ఈ ఫొటోకు వెనుక పేటీని ఉదహరించబడిన ది. 15-7-1940 తేదీన, రాణియమ్మారావుగారి కుటుంబం బొంబాయిలో వుండి వుండాలి. అనగా యిప్పటికి పదిహేడు సంవత్సరాల క్రితం, వారు బొంబాయి నివాసులుగా వున్నారేమో మనం తెలుసుకోవాలి.'

'దానికేముంది—అడుగుతే వారే చెబుతారు.'

'వారు చెప్పరు.'

'మీ అంచనాలు చాలా అద్భుతంగా వున్నాయి. నాకేమీ అర్థంకావటంలేదు. వారెందుకు చెప్పరు ? ఈ ఫొటోలోవున్న తేదీకీ, వారి బొంబాయి నివాసానికీగల సంబంధమేమిటీ ?'

'ఈ ఫొటో నాకు చాలా పరిచితమయింది. 1940 సంవత్సరం నా జీవితంలోకూడా ముఖ్యమయింది. అప్పటికి నా వయస్సు ఇరవైమూడేళ్ళు. యస్. ఐ. సెలక్షనులో ఆ యేడు మొట్టమొదటగా ఎన్నుకోబడ్డ వాణ్ని నేను. వర్సగా అయిదేళ్లు బొంబాయిలోనే ఉద్యోగంచేశాను. ప్రవేశించిన మొదటి సంవత్సరంలోనే, ఈ ఫోటోలోని కృష్ణఖాను హత్యా

నేరానికి బంధించబడ్డాడు. ఆ కేసులో నేను ఏక్టివ్‌గా పనిచేశాను. అందువల్ల, యీ ఫోటోలోని వ్యక్తిని గుర్తించగలిగాను.'

అని, మున్షీబాబు తను బొంబాయిలో యస్. ఐ. గా పనిచేసినప్పుడు పొందిన అనుభవాన్నిగురించి చెబుతుండగా, సర్కిలు రంగనాథం, చంద్రాన్ని వెంటబెట్టుకొచ్చి, స్టీం బోటులో ప్రవేశించాడు.

'చంద్రమంటే యితనేనా ?'

అని, మున్షీ బాబడిగాడు. చంద్రం, కమీషనర్‌గారికీ, మున్షీ బాబుకీ నమస్కారం చేసి నిలుచుండగా—

'వీరు మున్షీబాబని, గొప్ప అపరాధ పరిశోధకులు. నిన్నొకసారి చూడాలన్నారు, అందుకని పిలిపించాం.'

అని కమీషనర్‌గారు చంద్రంతో అన్నారు.

'ఇటువంటి పెద్ద ఉద్యోగులతో పరిచయం కలిగినందుకు నే నెక్కువగా గర్వపడుతున్నా సార్ !' అన్నాడు చంద్రం.

'నువ్వెంతవరకూ చదువుకున్నావు ?'

అని మున్షీ బాబు చంద్రాన్నడిగాడు.

'వ్రాయటం చదవటం తెలుసు-ఎక్కువగా పరీక్షలు ప్యాసు కాలేదు.'

'మేమడిగిన వాటికి అబద్ధం లేకుండా నిజం చెబుతావా ?'

'తప్పకుండా.'

'నువ్వు తరుచు భూపాలరావు గారింటికి వెడుతుంటావా ?'

'మరమనిషి గొడవ జరిగాక అయిదారుసార్లు వెళ్లాను. తరువాత భూపాలరావుగారే నన్ను తరుచు తమ యింటికి రావద్దన్నారు.'

'ఆయన అన్నారా ? ఎందుకని ?'

'వారు గొప్పవారు-వారి అంతస్తు వేరు-నా అంతస్తు వేరు అదే కారణం.'

'ఆయన కూతురు మిస్ కుమారి నిన్ను ప్రేమిస్తున్న మాట నిజమా ?'

ఆ ప్రశ్న వినగానే చంద్రం ఖంగారు పడ్డాడు.

'అసంభవం-అటువంటి విద్యా నాగరికతలు గల స్త్రీ, నన్ను ప్రేమిస్తుందంటే నేను నమ్మను. కాని, ఆమెకు నా యందభిమాన ముందనీ-ఆమె నన్ను తరుచు కలుసుకో గోరుతుందనీ తెలుసు. కాని నేనే అందు కవకాశ మియ్యడం లేదు.'

'ఎందుకనీ ?'

'వారి అంతస్తు వేరు-నా అంతస్తు వేరు. నా పరిచయం వల్ల ఆమె గౌరవం తగ్గుతుంది. నావల్ల ఆమె జీవితాని కపకారం జరగటం నే నంగీకరించ లేను.'

'అదంతా మాకు తెలీదు-నీ యిష్టంగాని, దాదా హత్య విషయంలో కూపీతియ్య డానిగ్గాని, పరమశివం భోగట్టా తెలుసు కోడానిగ్గాని, మాకు నీ సహాయం కొంత అవసరం.'

'చిత్తం. అందుకు నే నెప్పుడూ వెనుదియ్యనండి.'

'అంతేగాదు, కుమారితో నువ్వు స్నేహం మానకూడదు. ఆ కుటుంబానికి సంబంధించిన వివరాలు మాకు కొన్ని కావాలి. 1940 సంవత్సరంలో వారు బొంబాయిలో వున్నారా లేదా అన్న విషయం, నువ్వు ఆమెవల్ల తెలుసుకొని, మాకు జరుగు రుగా చెప్పాలి.'

'ఆ సంగతి మీరడిగితే వారు చెప్పరా అండి ?'

'చెప్పరు. అందువల్లనే యీ పని నీకు పురమాయించాము.'

'సరే-ఇంకేం చెయ్యాలంటారు ?'

'ముందు ఈ విషయం తెలుసుకో! తరవాత సంగతి ఆలో చిద్దాం.'

మున్షీ బాబు చెప్పినట్లు చెయ్యడానికి చంద్రం అంగీక రించాడు.

'బోటును వొదలకూడదండీ ! సముద్రంలో షికారుగా పోతూ మాట్లాడుకుందాం.'

అని సర్కిలన్నాడు. మున్షీబాబు స్టీంబోటును స్టార్టు చెయ్యడానికి తయారవుతుండగా—

'క్షమించండి-నేను వెళ్ళిపోతాను' అన్నాడు చంద్రం.

'మీకు సముద్ర ప్రయాణమంటే 'భయమా ?' అని సర్కిలడిగాడు.

'పోనీలెండి-అతన్ని వెళ్ళనియ్యండి' అని కమీషనర్ గారన్నారు. అవసరమైనప్పుడు తామే అతన్ని కలుసుకుంటూ వుంటామని మున్షీబాబు అతనితో చెప్పాడు. చంద్ర మనంతరం, అందరి దగ్గరా శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. కమీషనర్ వగైరాలు ముగ్గురూ, యింకా అనేక ముఖ్యవిషయాలు మాట్లాడుకుంటూ, సముద్రంమీద బోటు షికారుకు బయలుదేరారు.

౯

మిస్ మేరీ జాన్‌కు, నూట నాలుగు డిగ్రీలు జ్వరం ! జరిగిన సంఘటనతో ఆమెకు హృదయం బేజారయిందనీ, అందువల్లనే ఆ తీవ్రజ్వరమనీ చెప్పి, డాక్టర్లామెకు మందు అవసరం లేదన్నారు. ఆమెకాభయం పోవాలనీ, పూరా విశ్రాంతి అవసరమనీ చెప్పారు. మేరీజాన్ తల్లి, మేరీపీటర్, కూతురుకు కలిగిన యీ దుస్థితికి మరింత తల్లడిల్లి పోతూంది. ఉన్న ఆ వొక్క కూతుర్నీ పెట్టుకొని, ఆమె పోలీసుద్యోగం చేస్తూ నాలుగు డబ్బులు తీసుకోస్తూ వుంటే, ఆ వృద్ధురాలు కాలక్షేపం చేస్తుంటే, హఠాత్తుగా ఈ అవాంతర మొచ్చి పడింది. అంత భయంగల మనిషికి, పోలీసుద్యోగం పనికిరాదనీ, వెంటనే రాజీనామా యిచ్చి, మరో పనేదయినా చూచుకుని బ్రతకొచ్చునని, మేరీ పీటర్, కూతురుకు అనేకసార్లు హితవు చెప్పింది.

కాని, చూస్తూ చూస్తూ, ఉన్న ఉద్యోగాన్ని ఒదులుకోలేక, మేరీ జాన్ ఈ దుస్థితికొచ్చింది.

పరమసిషి పేరు వింటేనే అదిరిపడే ఆమె ఆ నాడా వింత వ్యక్తిని స్వయంగా చూచింది. అతని యినపచేతులామెకు తగల గానే ఒళ్ళు గగుర్పొడిచింది. ఇల్లు చేరేటప్పటికి పేలిపోయే జ్వరం. జరిగిన ఘోర ఘటన నెలాగో మూడు ముక్కల్లో తల్లికి చెప్పి, మంచంమీద పడిపోయింది. మేరీపీటరు డాక్టర్లను తీసుకొచ్చింది—చెయ్యవలసిన వన్నీ చేసింది. డాక్టర్లు చెప్పిం దాన్నిబట్టి, భయం పోతేగాని, జ్వరం తగ్గదని ఆమెకూడా తెలుసుకుంది. ఒళ్ళు తెలియని తీవ్ర జ్వరంలో పక్కమీద అదిరి పడుతున్న కూతుర్ని పట్టుకొంటూ, ఆమె మెదడుకు చల్లదనం కలిగించే శైత్యోపచారాలు చేస్తూ, మేరీ పీటరా రాత్రి పన్నెండు గంటలవరకూ గడపింది. తన బిడ్డకా ప్రమాదస్థితిని తప్పించ వలసిందని, ఏసు ప్రభువును ప్రార్థించుకొంటూ, నిమిషమొక యుగంగా గడుపుతున్న ఆ అర్ధరాత్రి సమయంలో, బంధింపబడి వున్నవీధి తలుపులుమీద ఎవరో దబదబ కొడుతున్న చప్పుడు వినిపించింది. మేరీపీటరు తృళ్ళిపడి—'ఎవరు వారు?' అంది.

'ఒక్కసారి తలుపు తియ్యండి.'

అని అవతలనుంచి ఒక పురుష కంఠం వినిపించింది.

తన కూతురు స్థితి తెలిసిన వారెవరో ఆమెను చూడాలని వచ్చి వుంటారని వూహించిన మేరీ పీటరు, కూతుర్ని మెల్లిగా పడుకోబెట్టి, తలుపు దగ్గరగా వెళ్ళి—'ఎవరు వారు?' అని మళ్ళీ అడిగింది.

'ఒక్కసారి తలుపు తియ్యండి' అని అవతల నుంచి పురుష కంఠం కూడా అదే జవాబు చెప్పింది.

'మీరెవరండీ!'

'భయంలేదు-తలుపు తియ్యమ్మా!'

అని, అతి ప్రశాంతంగా పలుకుతున్న ఆ గొంతుక విని, మేరీ పీటరు ధైర్యంగా తలుపు తెరచింది. కాని, ఆపాద మస్తకం ఒక నల్లటి ముసుగు కప్పుకున్న వ్యక్తిని చూడగానే ఆమెకు గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. నోటంట మాట రాలేదు. ఆ వ్యక్తి మరేమీ పలక్కుండా, అది తన స్వంత యిల్లయినట్టు, మేరీ పీటరు గుమ్మంలో వుండగానే, తను లోపలికెడుతుంటే, ఆమె విభ్రాంతురాలై అతన్ని అనుసరించింది. ముసుగు మనిషి క్రమంగా, మెరీజాన్ వున్న మంచం దగ్గిరికెళ్ళి నిలిచి—

'మీ అమ్మాయి కెలా వుంది? జ్వరమింకా తగ్గలేదా?' అని యథాప్రకారం సహజ శాంతి స్వరంతో అడిగాడు. మేరీ పీటరు కతని మాటల తీరుచూస్తే భయం కలగలేదు. కాని, అతను ముసుగులో వున్నందుకు కొంత అనుమాన పడింది.

'మీరెవరు? ఇలా ముసుగులో యెందుకున్నారు?'

'నేను మీకు ఉపకారం చెయ్యడానికొచ్చాగాని, అపకారం చెయ్యడానికి రాలేదు. ముందర తలుపులు వేసి రండి—'

'అలా యెందుకు?'

అని మేరీ పీటరన్నందువల్ల, ఆ ముసుగు మనిషి తానే స్వయంగా వెళ్ళి తలుపులు వేసివచ్చాడు. మేరీ పీటరుకు అతన్ని వారించగల శక్తి లేకపోయింది. తిరిగి వచ్చి ఆ ముసుగులో వున్న వ్యక్తి యిలా అన్నాడు: మంచంమీద ఒళ్ళు తెలియని తీవ్ర జ్వరంలో వున్న లేడీ యస్. ఐ. కూడా గుడ్లువొదిలి అతని వేపు చూస్తూ, అతని మాటలు వింటూంది:

'ఏసు ప్రభువుమీద మీకు నమ్మకముందా?'

అని అతను మెల్లిగా అడిగిందానికి మేరీ పీటరు—

'పూర్తిగా వుంది' అని భయపడకుండా బదులు చెప్పింది.

'ఉంటే, నన్నిప్పుడిక్కడికా యేసు ప్రభువే పంపించాడని నమ్మండి, మీా అమ్మాయికి జ్వరం పోతుంది.'

'అదే కావాలి నాయనా! మరమనిషిని చూసింది—బిడ్డ ప్రాణం బేజారయిపోయింది.'

'మర మనిషి ఆమె అనుకున్నంత దుర్మార్గుడుకాడు—'.

'నీకు తెలుసా?'

'నేనే ఆ మర మనిషిని.'

అంటూ ఆ వ్యక్తి, తన ముసుగు తొలగించాడు. మంచం మీాద వున్న మేరీ జాన్ లేచి కూచుంది. మంచం దగ్గర వున్న మేరీపీటరా ఆకారం చూసి తొట్రుపడుతుండగా—

'మీాకేం భయంలేదు-నేను మీాకేమీా అపకారం చెయ్యను. అమ్మా! మేరీజాన్! నీకిప్పుడే జ్వరం పోతుంది చూడు!'

అని అతనెంతో దయగా మాట్లాడుతూ, మేరీజాన్ నుదురు మీాద చెయ్యివేసి తాకాడు. ఆమెకు వొంటిమీాదికి తెలివొచ్చింది. కాని, ఎదురుగా వున్న మరమనిషిని చూచి ఖంగారు పడు తోంది. అప్పుడతను తిరిగి—

'మీా ఏసు ప్రభువే నన్ను పంపించాడు. నావల్ల మీాకే అపకారం జరగదు. నీదగ్గర తీసుకున్న రికార్డు యిదిగో! అందులో నాకు పనికొచ్చే కాయితాలేమయినా వుంటాయను కున్నా. కాని అవేవీ నాకు పనికిరాలేదు. నీకు అధికారుల వల్ల మాట రాకుండా చెయ్యాలని, నీ రికార్డును నీకు మళ్ళీ పట్టుకొచ్చి యిస్తున్నా. తీసుకో—'

అంటూ, మరమనిషి తాను తెచ్చిన రికార్డు కట్టను మంచం మీాద పెట్టి—

'మీా అమ్మాయికిపాటికి జ్వరం తగ్గివుంటుంది చూడండి.'

అనగా, మేరీపీటరు, కూతురు నుదురుమీాద చెయ్యివేసి చూసింది.

'తగ్గింది' అన్నదామె.

'నాకిప్పుడు జ్వరం లేదే అమ్మా! మన ఆత్మీయుడిలాగ, యీ మరమనిషి యింత దయగా మాట్లాడుతున్నాడేమిటి?'

'నేను ఒక్కడికి తప్ప, మిగిలిన వారందరికీ ఆత్మీయుణ్ణే!'

'దాదాను హత్యచేసింది నువ్వు కాదా?'

'కాదంటే యిప్పుడెవరూ నమ్మరు. నేను ఒక్కడికి తప్ప, యింకెవరికీ హాని తలపెట్టేవాణ్ణి కాదని, మీకు రాసిన ఎర్ర సిరా ఉత్తరంలో లేదూ?'

'వుంది-ఆ ఎర్రసిరా వుత్తరాలు మా అందరికీ యెలా అందజేశావు?'

'అదంతా యిప్పుడు అనవసరం గాని, నా గురించి నువ్వంతగా హడిలి బేజారు కావడం చాలా అనవసరమని యిప్పుడన్నా తెలిసిందా?'

'తెలిసింది.'

'అయినా, పిల్లల్ని కనాల్సిన ఆడవాళ్ళకి పోలీసుద్యోగమేమిటమ్మా? మాతృత్వం గల నీ లాంటి మహిళలు, మాతలు చేసే పని చెయ్యాలిగాని, కోతలెందుకూ కొయ్యటం? అందులోనూ, నాలాంటి మరమనిషిని పట్టడానికా నీ ప్రయత్నం?'

'నిజం-నిజం-ఇహ మా అమ్మాయిచేత పోలీసు ఉద్యోగానికి రాజీనామా యిప్పిస్తా.'

'నా గురించి మాత్రం, అటువంటి పని చేసుకోనక్కర్లేదు. నేను మీ అమ్మాయికే గాదు-ఆ ఒక్క భూపాలరావుకు తప్ప యింకెవరికీ అపకారం తలపెట్టను. దాదాని హత్యచేసింది నేను కానని, మీ యితరోద్యోగులకు చెప్పు-వొస్తా'

అని మరమనిషి యథాప్రకారం తన మునుగు కప్పుకొని తలుపులు తెరుచుకొని, చీకట్లోపడి, తన చక్రాల కాళ్ళమీద పరుగెత్తిపోయాడు. మేరీపీటరు తలుపుమూసి, తిరిగి కూతురున్న దగ్గిరి కొచ్చింది.

'ఈ సంఘటన, అన్నిటికంటే విడ్డూరంగా లేదూ ?'

'నా కిప్పుడు జ్వరం పూర్తిగా పోయిందమ్మా ! మరమనిషి యిటువంటి దయామయుడనుకో లేదు.'

'అయినా సరే, నీకి పోలీసుద్యోగ మొద్దుతల్లీ ! రేపే పోయి రాజీనామా యిచ్చిరా.'

'ఇప్పుడు నాకేం భయంగా లేదమ్మా ! అనవసరంగా రాజీనామా యిచ్చుకోటం దేనికి ?'

'నీకు తెలీదు. తక్షణం రాజీనామా ఇయ్యి. ఆడవాళ్ళకి పోలీసుద్యోగం పనికిరాదు. ఇప్పుడు గాకపోయినా, ఇటువంటి ఘోర పరిస్థితుల్ని, పోలీసుద్యోగంలో వున్నవారు అనుక్షణం ఎదుర్కొంటూ వుండవలసిందే ! ఆ వుద్యోగం నీకు పనికిరాదు.'

అని తల్లి అంటున్నదానికి మేరీజాన్ చిరునవ్వు ముఖంతో-

'ఫరవాలేదమ్మా' అంది.

'ఇప్పుడలాగే అంటావు-నీ జ్వరతీవ్రత చూస్తే ఇంతలో యిలా అవుతావనుకోలేదు. ఏ క్షణాని కాక్షణం నీ స్థితిచూస్తే, నా ప్రాణమే ఎగిరిపోతుందేమో అనిపించింది. నిజంగా ఆ ఏసు ప్రభువే మనకీ గండ మీవిధంగా తప్పించి వుంటాడు.'

'సర్లే అమ్మా-యింక పడుకో-నిద్రలేక, చాలా శ్రమపడి వుంటావు. ఉద్యోగం విషయం ఆలోచిద్దాంలే.'

అని కూతురు నచ్చజెప్పిన మీదట, తల్లి కొంతవరకూ తృప్తిపడి, నిజంగానే నిద్దర రావటంవల్ల, కూతురు పక్కలోనే పండుకొంది. మిగిలిన రాత్రంతా తల్లీకూతుళ్ళిద్దరూ సుఖంగా నిద్దర పోదామనుకొంటూ వుండగా తిరిగి వీధి తలుపు మీద చప్పుడు !

## ౧౦

'మరమనిషి ! మళ్ళీ వొచ్చాడెందుకో !' అని మేరీజాన్ లేచి కూర్చోగా—

'ఉండు—నేనుపోయి తలుపు తీస్తా.'

అంటూ, వృద్ధురాలయిన మేరీపీటర్, మెల్లిగా లేచివెళ్ళి -యీమాటు ఏమీ భయంలేకుండానే తలుపు తీసింది. కాని ముందొచ్చిన ముసుగులోని మరమనిషి కాదు. ఆతనెవరో నూతన వ్యక్తి. ఎవరని అడక్క ముసుపే ఆతను లోపలికొచ్చి—

'మీ యింట్లో కిప్పుడెవరయినా వచ్చారా ?' అని మంచం మీద కూచొనివున్న మేరీజాన్ నడిగాడు.

'నువ్వెవరూ ? అనుమతి లేకుండా లోపలి కెందుకొచ్చావూ ? ఇది లేడీ యస్. ఐ. మిస్ మేరీజాన్ యిల్లు.'

అని మేరీపీటరు కోపంగా అంది.

'ఆ సంగతి నాకు తెలుసు కాని, మీ యింట్లోకొచ్చిన ఆ వ్యక్తి యెలా వెళ్లాడో ముందర చెప్పండి.'

'నువ్వు ముందర బయటికి వెళ్ళు. లేకుంటే, పోలీసులకు కబురుచేస్తాం' అంది మేరీపీటరు తిరిగి.

'నేను కూడా పోలీసు ఆఫీసర్నే' అని అతను చెప్పక తప్పలేదు అందువల్ల .

'అబద్ధం ! నాకు తెలీని పోలీసుద్యోగు లెక్కడెవరూ లేరు- అంది మేరీజాన్.

'అర్ధరాత్రి మోసం చెయ్యడానికా వచ్చావు ? మా అమ్మాయి సబ్‌యిన్‌స్పెక్టరు ! చూడు, నిన్నిప్పుడేం చేస్తామో.' అని మేరీ పీటరు అంటున్న మాటలు వినిపించుకోకుండా ఆ నూతన వ్యక్తి యింట్లో నాలుగు మూలలా గాలించి, ఎవరూ కనుపించక పోవటంవల్ల, 'మీ యింట్లోకిప్పుడు మరమనిషి రాలేదా ? త్వరగా చెప్పండి. పోలీసుద్యోగం చేస్తూ, పోలీసులకు సహాయం చెయ్యకపోవటం నేరమవుతుంది' అన్నాడు.

'మరమనిషి-వొచ్చాడు-వెళ్ళాడు.' అంది మేరీ పీటరు.

'ఎలా వొచ్చాడు-ఎలా వెళ్ళాడు ?'

'ఎలా ఒచ్చాడో అలాగే వెళ్ళాడు. మా అమ్మా యింతవరకూ చాలా జ్వర తీవ్రతలో వుంది. ఘమ్మల్ని తొందర చెయ్యకుండా వెళ్ళిపొండి.'

'వాడొచ్చి, యిక్కడ ఎం చేశాడు? మీరా మరమనిషి నెందుకు పట్టుకోలేదు?'

'అదంతా రేపు మా అమ్మాయి, స్టేషనుకొచ్చి చెబుతుంది. నువ్విప్పుడామె నిద్రకు భంగం చెయ్యకుండా, త్వరగా వెళ్ళిపోవాలి.' అని మేరీ పటరనక మునుపే, అతను నాలుగడుగుల్లో రోడ్డుమీదికి పరుగెత్తుకొచ్చి నాలుగు వేపులా చూశాడు. మేరీ పీటపు, యథాప్రకారం, తలుపులు మూసుకుంది. తను మున్షీ బాబునని చెప్పుకొన్నా కూడా అక్కడ కలిగే ప్రయోజనంయెక్కువ వుండదని తెలుసుకోపటం వల్ల, వారిదగ్గర తన విషయం బయట పెట్టకుండానే వచ్చేశాడు. తిరిగి తానెక్కి వచ్చిన సైకిలెక్కి ఎటుపోవాలా అని ఆలోచిస్తుండగా, ఎక్కడి నుంచో పోలీసుల ఈలలు వినిపించాయి. ఆ దెసకు తన సైకిలు తొక్కుకు పోయాడు. ఒక క్రాస్ రోడ్డు దగ్గర, నైట్ డ్యూటీ చేస్తున్న యిద్దరు పోలీసులు గుసగుస లాడుతూ కనుపించారు. సైకిలుమీద వ్యక్తి రాగానే సైకిలు పట్టుకున్నారు. మున్షీబాబు తన చొక్కా జేబు లోంచి ఒక చిన్న కార్డు తీసి వాళ్ళకు చూపించాడు, వాళ్ళతనికి నమస్కారం చేశారు.

'ఈలలు వేసింది మీరేనా?'

'చిత్తం!'

'ఎందుకనీ?'

చక్రాల కాళ్ళపై ఎవరో వ్యక్తి యిటు పరుగెత్తు కొచ్చాడు. వాడు మరమనిషి అని అనుమానించాం. వెంట తరమటానికి మా దగ్గర వాహనం లేకపోయింది. అందుకే యీలలు వేశాం.'

'వాడెటు పరుగెత్తాడు?'

'అటు చెర్చిరోడ్డు వేపు. వెనుక భాగాన ఒక ఎర్రదీపం కను పిస్తుంది. ఒకవేళ, అది సైకిలు, లేక మోటారుసైకిలు అయి వుండటాని కవకాశముంది.'

'ఏమీ కాదు. వాడే మరమనిషి ! ఇడియట్స్ ! తరమటానికి వాహనం లేదని మరమనిషిని వొదిలేశారు.' అని, మున్షీబాబు యిక అక్కడ నిలవకుండా సైకిలెక్కి దాన్ని శరవేగంగా తొక్కాడు. కాని, చూపు కందినంతమేర యెర్రదీపంకాని, ఏ వాహనంకాని అంతు చిక్కటం లేదు. బైసికిల్ను యింకా బలం కొద్దీ తొక్కుకు పోగాపోగా, ఆ సరాసరి రోడ్డుమీద సుమా రొక రెండుమైళ్ళ దూరంలో, ఒక యెర్రదీపం యిట్టె కనుపించి అట్టె మాయమయింది. మున్షీబాబుకి ఆశపుట్టింది. మరింత ఉత్సా హంతో ముందుకు పోయాడు. అది సముద్రానికి దరిదాపు. కొన్ని కర్మాగారాలు, కార్మికుల యిళ్లు దాటాక, కొంతదూరం ఖాళీ స్థలాలు వున్నాయి. మున్షీబాబు, వాటి నన్నింటినీ కూడా దాటి ఎర్రదీపం ఎటువెళ్ళిందీ అంతు చిక్కక పోవటంవల్ల, అక్కడ సైకిలు దిగి; అన్ని వేపులా చూచాడు. రెండు ఫర్లాంగులలో తిరిగి యెర్రదీపం కనుపించింది. పబ్లికు దీపాలు కూడా ఆ ప్రాంతంలో యెక్కువగా లేకపోవటంవల్ల, అతను కొంచం కష్టంమీద ఆ రెండు ఫర్లాంగులూ నడిచాడు. ఎర్రదీపం ఓ పక్కకుమళ్ళి తిరిగి కనుపించలేదు. మున్షీబాబు ద్విగుణీకృత వేగంతో ఆ మలుపుకు పోయి చేరాడు. అక్కడొక వీధిగాని వొంపుగాని యేమీలేదు. రోడ్డుకు పక్కగా ఒక విశాలమయిన ఖాళీ స్థలము దానికి చుట్టూ ఎత్తయిన ప్రహారీ మధ్యలో ఒక చెర్చి కట్టడమూ కనుపించాయి.

ఎర్రదీపం ఆ చెర్చి అవరణలోకి మళ్ళి వుంటుందని అంచనా వేసుకుని, తానున్నూ గేటుదాటి అవరణలో ప్రవేశించాడు. అక్కడ ఎక్కువ చెట్లుగాని, మరుగు గల యితర కట్టడములుగాని ఏమీ

లేవు. అంతా బంగన్న బయలుగాను, భయంకరమయిన చీకటి గానూ వుంది. చెర్చి తలుపులు కూడా తియ్యబడే వున్నాయి. కాని, కొన్ని గోడలు పడిపోయి, ద్వారములు శిధిలమై, వుండటం వల్ల, ఆ చెర్చి అసలులో లేక, పాడుపడి వున్నట్లర్ధం చేసుకొని, తన దగ్గరున్న టార్చిలైటు వెలిగించి అన్ని వేపులూ పరిశీలించాడు. ఎఱ్ఱదీపం గల ఆ వ్యక్తి, అదే ఆవరణలో ప్రవేశించి వుంటే, ఆ చెర్చిలోకి దూరి నక్కి వుండవలసిందే గాని, యింకెక్కడా నక్కడాని కవకాశాలు లేవని ఊహించుకొన్న ముస్లీబాబు, చేతిలో వున్న టార్చిలైటు ఆర్పకుండా చెర్చిలో ప్రవేశించాడు. బూజు బూదిలతోనిండి వున్న ఆ చర్చిలో ఒకే ఒక నిలువెత్తుగల ఏసుక్రీస్తు శిలా విగ్రహం మాత్రం శిలలు కొట్టబడినవిగా వుంది. ముస్లీబాబు, లైటువేసి అన్నివేపులా చూసాడు. కాని అక్కడ యింకెవరూ గాని యింకేమీ కాని కనపించలేదు. ముస్లీబాబుకి అనుమానం రహితం కానందువల్ల, అక్కడే మరికొంత సేపు నిలుచుకున్నాడు.

'ఎఱ్ఱదీపం ఈ ఆవరణలోకి రావటం స్పష్టంగా చూశాను. అందులో సందేహమేమీలేదు. కాని, యిక్కడేమీ కనుపించక పోవటం చాలా అద్భుతంగా వుంది. ఆవరణకింకోమార్గ మెటువేపయినా వుంటే, లేక ప్రహరీగోడలు దూకి, ఆ వ్యక్తి యెక్కడికయినా పరారి అయివుండాలి. అలా పరారికావడానికి, నేను తన్ను వెంట తరుముతున్నానని వాడు గ్రహించివుండాలి.' అని తనలో అనుకొని, ముస్లీబాబు తిరిగి యివతలకొచ్చాడు. చేతిగడియారం వేపు చూసుకొంటే, రెండుగంటలకూ పదినిమిషాలు తక్కువగా అయింది. ఆవరణ నంతటినీ చుట్టి రావటానికి బయలుదేరాడు. చెర్చి కట్టడానికి వెనుకభాగాన, ప్రహరీ గోడకు మరియొక ద్వార మమర్చబడి వుండటం కనుపించింది. దానితో అతనికి సందేహం తీరిపోయింది. ఎఱ్ఱదీపంగల అవ్యక్తి

ఆవరణలో ప్రవేశించినీ్న ఆ వెనుకద్వారంగుండా దాటి పోయి వుంటాడని అర్థం చేసుకున్నాడు. ఆ ద్వారం మరియొక రోడ్డు మీదకుండడము-ఆ రోడ్డుగుండా పోతే, అది ఆవరణనుబట్టి, తిరిగి తను మొదట ప్రవేశించిన ద్వారం దగ్గిరికే తీసుకొస్తుందని తెలుసుకున్నాడు. శ్రమ అంతా వృధా అయిందని నిరుత్సాహ పడుతున్న సమయంలో, దూరాన, ఒక మోటారు చప్పుడు వినిపించి, అది క్రమంగా తానున్న దగ్గిరికే వస్తున్నట్లు తోచటం వల్ల, అతనావేపుకే నిదానించి చూస్తున్న మరికొన్ని క్షణాల్లో ఆ కారు అతని దగ్గరకే వచ్చింది. అతన్ని చూడగానే కారు ఆపు చెయ్యబడింది. అందులోనించి దిగి వచ్చినసర్కిలు రంగ నాథం, మున్షిబాబును చూడగానే తెల్లబోయి—'ఓ! మీరా! యిక్కడి కెలా వొచ్చారు?' అని అడిగాడు మున్షీబాబు నవ్వి.

'మీరెలా వచ్చారో-నేనూ అలాగే వచ్చాను. శ్రమకు తగిన ఫలితం కనుపించలేదు.' అన్నాడు.

'నా పనికూడా అంతే అయింది కాని, మరమనిషి పదకొండు గంటల రాత్రిమొదలు, నగర వీధుల్లో సంచరిస్తున్న మాట ఖాయం.'

'అంతేగాదు-వాడు పన్నెండు గంటలకు మన లేడీ యస్. ఐ. మేరీజాన్ ఇంట్లో ప్రవేశించటం నేను చూశాను.'

'అలాగా? తరవాత యేమయింది?'

'నేనున్నూ వాడిని దూరంనుంచి ఆ యింట్లో ప్రవేశించే టప్పటికి, వాడు దాటిపోయాడు.'

'మేరీజాన్ ఏమంటుంది?'

'మరమనిషి వచ్చాడనీ, వెళ్ళాడనీ ఒప్పుకొంది, కాని ఆమెకు జ్వరమట—ఎక్కువ వివరాలు చెప్పే స్థితిలో లేదు. ఉదయం, స్టేషనుకొచ్చి అన్ని వివరాలూ తెలుపగలదని-ఆమె ముసలి తల్లి అంది.'

'మీరు ఫలానా అని తెలుసా ?'

'నేను తెలుసుకోలేదు. అనవసరం. మరమనిషిని వెంటాడించి పట్టుకోవటంలో నాదృష్టి వుందిగాని, జరిగిపోయిందాన్ని గురించి కాలం వృధాచెయ్యదలచ లేదు.'

'మరమనిషికి వెనకాల ఎర్రదీపముందా ?'

'ఆఁ! ఆఁ! మీరు చూశారా ?'

'లేదు. పన్నెండున్నరగంటలకు నా ఆఫీసుకు ఫోన్ వచ్చింది. నైట్‌డ్యూటీ చేసే కొందరు పోలీసులకు వాడా ఎర్రదీపంతో కనుపించి, దొరక్కుండా పారిపోయాడట. అది తెలిసే నేను బయలుదేరాను.'

'నిజం. అంతే. నేను వాణ్ని యీ చెర్చిదాకా వెంట తరిమాను. వాడీ ఆవరణలో ప్రవేశించటం కూడా తెలుసుకున్నాను. ఆ తరవాత వాడేమయిందీ తెలీశంలేదు.'

'ఇది చిరకాలం నుంచి వాడుక లేకుండా పాడుపడివున్న చర్చి—'

'అలాగే కనుపిస్తుంది.'

'లోపలికిపోయి చూశారా ?'

'ఆఁ! ఏసుక్రీస్తు శిలావిగ్రహం మాత్రం నిలువెత్తున వుంది.'

'అంతేకాదు-దానిని ఎత్తగలిగిన వారింతవరకూ ఒక్కరూ లేరు. అనేకమంది ప్రయత్నంచేశారు.

'అంత బరువుగా వుందన్నమాట ?'

'అది దాని బరువో-లేక అది భూమిలో ఎక్కువ లోతున పాతబడివుందో—బద్దలుకొట్టి చూడడానికి రూల్సు ఒప్పుకోలేదు. అందుకని ఉపేక్ష చేసి వూరుకున్నారు.'

'సరి, దానికేమి—ఇప్పుడు మన కర్తవ్యం ?'

'మీ వుద్దేశమేమిటీ ?'

'చర్చి ఆవరణలో ప్రవేశించినవాడు, నేను తన్ను వెంటాడిం

చటం గ్రహించి, యీ వెనుక ద్వారంగుండా పరారి అయినా డని, నా అంచనా.'

'అయితే, కాలయాపన చేస్తారెందుకూ? బయలుదేరండి—ప్రయత్నం చేస్తే లాభముండవచ్చు.'

'సైకిలు—?'

'కారుకు వెనకకట్టి, యిద్దరం కారులోనే పోదాం.' అని సర్కిలు రంగనాథం చెప్పిన ప్రకారం, యిద్దరూ చేరి సైకిలును కారుకు వెనుక కట్టి, కారులో బయలుదేరారు. ఎర్రదీపం ఎటుకనిపిస్తే అటు—ఎది కనుపిస్తే అక్కడికి పోయి చూస్తున్నారు కొన్ని ఎర్రదీపాలు రోడ్లమీదవి-మరికొన్ని, రైల్వేగేట్లవీ, అయివున్నాయేగాని, మరమనిషి ఎర్రదీపం ఎక్కడా కనుపించటం లేదు. అసలు, మనిషికి వెనుకభాగాన ఒక ఎర్ర దీపమెందుకో వారికర్థంకాలేదు. చక్రాలు గలవాడు గాబట్టి, వాహనాల్లో లెక్కకట్టుకుని అటువంటి దీపమును పెట్టు కొని వుంటాడని వూహించుకున్నారు. ఏదియేమయినా, ఆ రాత్రి కెలాగయినా ఎర్రదీపం సంగతి తెలుసుకు తీరాలని, రంగనాథం మున్షీబాబులిద్దరూ, పట్టుపట్టారు. ఆ పట్టుదలతో 'పిష్టల్' ఒకరూ, రివాల్వరొకరూ, తయారుగా పట్టుకొని,కార్ను జోరుగా డ్రైవ్ చేసుకుపోతున్నారు. నగరమంతా చుట్టి చుట్టి, ఒక ట్రంకురోడ్డు మలుపులోకి కారు మళ్ళగానే అదే ఎర్రదీపం దూరాన కెంపులాగ మెఱిసింది.

'అదుగో! యెర్రదీపం! కారును జోరుగా పోనియ్యండి! ఈసారి వొదలకూడదు.'

అని డ్రైవ్ చేస్తున్న సర్కిలును హెచ్చరించాడు మున్షీ బాబు.

'అంత కాంతివంతమయిన ఎర్రదీపాన్ని నేనెక్కడా చూడ లేదే. అని, రంగనాథం కారుస్పీడును ద్విగుణీకృతం చేశాడు.

'సైకిలయిపోయిందికాని, ఈ కారే, యిదివరకుంటే, మర మనిషిని అప్పుడే షూట్‌చేసి వుందును.' అన్నాడు మున్షీబాబు.

అత నూహించిన ప్రకారం, కొద్ది క్షణాల్లోనే యెర్రదీపం దగ్గరపడింది.

'ఆ మరమనిషిని పట్టుకు బంధిద్దామా ? షూట్ చేద్దామా ?' అని రంగనాథం అడిగిందానికి. 'పట్టుకుని బంధించడానికే ప్రయత్నం చేదాం,దొరక్కపోతే పిస్టల్‌తో షూట్ చేదాం. రివాల్వరు కాల్పులిదివర కనేకసార్లు విఫలమయ్యాయని విన్నాను.' అన్నాడు మున్షీబాబు.

'అవును. లేదా, రెంటినీ ఏక కాలంలోనే వుపయోగించటం యింకా మంచిది.' అన్నాడు రంగనాథం.

ఎర్ర దీపానికీ, వారికీ గల మధ్యదూరం, మైళ్ళల్లో నించి, ఫర్లాంగుల్లో పట్టంవల్ల, పోలీసుద్యోగుల కిద్దరికీ అధికమయిన ఉత్సాహము, అమితమయిన ఆవేశమూ కలిగాయి. మరికొన్ని క్షణాల్లో పోలీసుల కారు, ఎర్రదీపానికి ఒకే ఒక ఫర్లాంగు దూరంలో సమీపించింది. దగ్గరయిన కొద్దీ ఆ దీపం యొక్క కాంతి ఉద్రుతం కావడమే గాకుండా చూడ నశక్యంగా వున్నట్లు వారు గ్రహించారు. కారు, ఫర్లాంగుదూరం కంటే, యింకా దగ్గర కావడం మొదలు పెట్టేటప్పటికి,డ్రైవ్ చేస్తున్న ఈ సర్కిల్ రంగనాథం కళ్ళు యెర్రదీపం కాంతికి మూతలు పడిపోయాయి. అతను చూళ్ళేకపోతున్నాడు.

'ఏవండీ! ఏవండీ! స్టీరింగు మీరు పట్టుకోండి! నా కను రెప్పలు వెయ్యి మణుగుల బరువెక్కి మూతలు పడ్డాయి కళ్లువిప్ప లేను.' అన్నాడు ఖంగారుపడుతూ

'నాక్కూడా సరిగ్గా అలాగే అయింది అంతటా అంధకార బంధురం, వెంటనే బ్రేక్ వెయ్యండి. లేకుంటే ప్రమాదం.' అన్నాడు మున్షీబాబు. సర్కిల్ రంగనాథం అదే ప్రకారం,

బ్రేక్ వేశాడు. కారు నిలిచిపోయింది. సుమారొక పది నిమిషాల వరకూ, యిద్దరూ కళ్ళు తెరవలేకపోయారు. ఆ తరువాత, క్రమంగా కనురెప్పలు తేలికపడ్డాయి. కళ్ళు విప్పి చూచేటప్పటికి ఎదురుగా యేమీలేదు. ఎర్రదీపం వారి చూపుల్లోంచి ఎప్పుడో దాటిపోయింది. రంగనాథం ముస్తిబాబు లిద్దరూ విభ్రాంతులై ఒకరి ముఖాల్లో కొకరు చూచుకున్నారు.

'ఏమిటీ మహామాయ ?' అని రంగనాథమనగా.

'మాయాకాదు. ఏమీకాదు. అదొక అద్భుతదీపం దానిశక్తి వల్లనే మనకళ్ళలా మూతలు పడ్డాయి.'

'ఎంత బలం వుపయోగించినా కళ్ళు విప్పలేకపోతే !'

'అవును. నాకూ అలాగే వుంది. దాని శక్తి శోకినంత వరకూ అలా అయింది. అది దూరంగా కనుపించినంత సేపూ మన చూపు మామూలుగానే వుంది. దీన్నిబట్టి, ఒక నిర్ణీతమయిన దూరంలో వున్నప్పుడు మాత్రమే దాని ప్రభావం తగిలి కళ్ళు మూసుకుపోతాయని అర్థమవుతూంది,'

'అప్పుడిక మనమేం చెయ్యవలసి వుంది ?'

'దూరంలో, అనగా, మనకళ్ళకా దుష్టశక్తి తగలని క్రితమే మూటుచెయ్యవలసింది. లేదా ఆ శక్తికి 'యాన్టీ' శక్తిగల అద్దాలు ధరించాలి. రసాయనిక నిపుణుల్ని సంప్రదిస్తే, తప్పక అటువంటి అద్దాలు సంపాదించగలం.'

'ప్రస్తుతం ఏం చెయ్యాలి ? తిరిగి వెంటతరుముదామా ?'

'లాభంలేదు. నా కళ్ళల్లోని సూక్ష్మమయిన నరాలకింకా ఎప్పటి శక్తి కలుగలేదు. తల దిమ్ముగా వుంది.'

'నాపని అంతకంటే హీనంగా వుంది. ప్రస్తుతం వెనక్కి మళ్ళిపోవడమే కర్తవ్యం.'

అని నిశ్చయించుకొన్న పోలీసుద్యోగు లిద్దరూ నిరాశులై కార్ను వెనక్కు మళ్ళించుకున్నారు.

## ౧౧

గాంధీ మహాత్మునిలాంటి శుద్ధ సత్వ గుణప్రధాని! చీమకయినా చెరుపు చెయ్యని స్వభావుడు! అటువంటి దాదాని హత్య చెయ్యడానికి ఏ కఠినాత్ముడికి చేతులొచ్చాయో! ఏ దుర్మార్గుడి మనసంగీకరించిందో! అదే స్వరూపం! అతనే దాదా! అంత వరకూ యేడిచేడిచి అప్పుడే కన్నుమూసిన కుమారిక్కనుపించాడు.

'ఎందుకమ్మా! నాకోస మలా యేడుస్తావు? ఎనభై యేళ్లు దాటిన ముసలివాణ్ని! బ్రతికినన్నాళ్ళు బ్రతుకుతానా? ఈనాడు గాకపోతే మరోనాడయినా నేను చావకుండా వుంటానా? ఒద్దు-నువ్వు నాకోసమేడవొద్దు! నువ్వేడుస్తే, నా ఆత్మశాంతి చెడిపోతుంది!'

అన్నమాటలు, రక్తంతో తడిసిన గెడ్డంతో, కంఠంనుంచి కారుతున్న నెత్తురు ప్రవాహంతో మంచం పట్టుకు నిలుచున్న దాదా చెబుతుంటే, కుమారి తృళ్ళిపడి కళ్ళు విప్పింది. కాని అంతా శూన్యం, గదిలో ఎలక్ట్రిక్ దీపం మాత్రం వెలుగుతూంది. గోడకున్న గడియారం ఒకటి కొట్టింది. కుమారి ఒకసారి కళ్ళు నులుపుకుని, నాలుగువేపులా తిలకించింది. తానంత వరకూ కన్నది. కల అని అర్ధంచేసుకొని - ఒక నిట్టూర్పును విడిచింది.

'నన్ను విడవొద్దని చెప్పడానికా దాదా, కల్లో కనుపించావు! తలిదండ్రులకంటే యెక్కువ వాత్సల్యంతో యెత్తుకు పెంచినవాడివి-పసితనంలో పాలుపోసి సాకిందిగాక, చనిపోయేర్యేజున కూడా నానోటికి కాఫీ, అందించావు-నాకు పక్క అమర్చావు—నాకి ప్రపంచంలో నీ ప్రేమతప్ప యింకోటేదీ తెలీదు. నేను పుట్టాక, వాత్సల్యమన్నదాన్ని నీ ఒక్కళ్లోనే చూశాను. నీలాంటి ప్రేమహృదయం నాకు మళ్ళీ యెన్ని జన్మలెత్తితే

దొరుకుతుందా దాదా! దొరకదు—ఎన్ని జన్మలెత్తినా దొరకదు. అటువంటిది, నువ్వా దారుణహత్యకు గురియై భయంకరంగా చచ్చిపోతే, నేనేడవకుండా ఎలా వుంటాను? కల్లో కనుపించిన వాడివి, అన్ని మాటలు చెప్పావుకాని, ముఖ్యమయిన ఒకమాట చెప్పావుకాదు! నిన్నా దారుణహత్యకు గురిచేసిన పాపాత్ము లెవరు? నీ అంత మంచివాణ్ని చంపడాని కెవరికి చేతు లొచ్చాయి? ఆ ఒక్క కబురు చెప్పివుంటే, ఆ హంతకుణ్ని ఖండ ఖండలుగాచేసి, ఆ వేడి రక్తధారల్తో నీకు బలిదర్పణ మొదిలి, యీ నా దురంత దుఃఖాన్ని చల్లార్చుకోనా దాదా? ఆడదాన్ని-అబలని-అంతపని నావల్ల కాదని సందేహించావా?'

అనుకొంటూనే ఆమె మంచంమీద లేచి కూచుంది. అప్పు డామెలోని దుఃఖమంతా ఉద్రేకంగా రూపొందింది. కళ్ళంట నిప్పుకణాలు రాలాయి.

దాదాని హత్యచేసినవాడి గుండెలు చీల్చకపోతే, నేనుండి దేనికి? నా దాదాని దుర్మరణానికి గురిచేసిన వాడింకా బ్రతికి వుంటాడా? దాదాని చంపినవాడి రక్తం కళ్ళ జూడకపోతే, నాపేరు కృష్ణకుమారి కానేకాదు. నాది, అసలయిన స్త్రీ జాతి కానేకాదు. ప్రతీకారం చెయ్యకుండా నేను బ్రతకలేను.'

అని ఆపుకోలేని ఉద్రేకంతో మంచం దిగింది. క్షణ మాలో చించి, చరచర తండ్రి పడుకొన్న గదిలో కెళ్ళింది. ఆవేశంతో నడుంబిగించి, డ్రాయరు మీది తాళాలతో తండ్రి బీరువా తెర చింది. అరలో వున్న రివాల్వరును తీసి, కోపంతో బీరువా తలు పుల్ని విసురుగా వెయ్యటంలో ఫడాలున అయిన చప్పుడువల్ల భూపాలరావు తృళ్ళిపడి లేచాడు. నడుముకి పయిటచెంగు చుట్టి, చేతిలో రివాల్వరు పట్టి, కళ్ళంట అగ్నిజ్వాలలు గుమ్మరిస్తూ, అవతరించిన కాళీ రూపంలా నిలుచున్న కుమారిని చూచి విభ్రాంతుడయినాడు. ఆమె నటువంటి రౌద్రాకారంతో ఎన్నడూ చూచివుండక పోవటంవల్ల భయకంపితుడయ్యాడు.

'ఎందుకా కాళీ అవతారం ? ఎవరి ప్రాణం తియ్యటానికి ?'

అని, ఒక్క పరుగులో పోయి రివాల్వరుతో వున్న ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

'వొదులునాన్నా ! నా చెయ్యి వొదులు.'

అన్న కుమారి భయంకర గర్జనలో ఆ మందిరమంతా దద్ద రిల్లింది. అందుకు రాణియమ్మారావు కూడా నిద్దర్లో అదరిపడి లేచి, అక్కడికి పరుగెత్తుకొచ్చింది. చేతిలో రివాల్వరు పట్టి, ప్రచండ చండీ అవతారం దాల్చివున్న కుమారిని ఆమెను పట్టు కొని వున్న భర్తనూ చూచి భయంతో వొణికిపోతూ,

'ఏమిటిదంతా ? అంది కంపించే గొంతుకతో

'ఎవరి ప్రాణం తియ్యడానికో బీరువాలో రివాల్వరు తీసింది. నేను పట్టుకున్నాను.' అన్నాడు భూపాలరావు, ఒంటినిండా చమ టలు కక్కుతూ.

'ఏమిటమ్మా, యీ గందరగోళమంతా ? నీగ్గాని మతిపో యిందా ? రివాల్వరు వొదులు !'

అని రాణియమ్మారావు తీక్షణంగా అనగా,

'నేనదల్ను. వాణ్ని హతమార్చాలి. అప్పుడే రివాల్వరు వొద లాలి !'

'ఎవర్నె నువ్వు హతమార్చేదీ ?'

'దాదాని హత్యచేసిని వాణ్ని ! వాడు బ్రతకడానికి వీల్లేదు.'

'వాడెవడనీ ? యెక్కడున్నాడని ?'

'వాడే ! ఆ మరమనిషి ! వాడెక్కడున్నాసరే హతమార్చి తీరతాను. వాడి వేడిరక్తంతో దాదా ఆత్మశాంతికి బలితర్పణ మొదిలి తీరతాను. ప్రతీకారం చెయ్యకపోతే, నేను బతకలేను.'

అప్పటికి, భార్యాభర్తల గుండెలు కొంచెం వదిలపడ్డాయి.

'పిచ్చిదానా ! పోలీసులందరూ ఏకమై సాధించలేని పనిని నువ్వా సాధించేది ?'

అని రాణియమ్మారావంది.

'అవును. నేనే సాధిస్తాను! నన్ను వొదిలిపెట్టండి.'

'ఈ అర్ధరాత్రి యెక్కడికి పోతావే! ఎవరయినా వింటే నవ్వి పోతారు. నీకు నిజంగానే పిచ్చిపట్టింది.'

'మీరేమయినా అనుకోండి! నేను వెళ్ళి తీరతాను. హంత కుణ్ణి హతమార్చక మానను.'

'ఎక్కడికి వెడతావు? ఆ మరమనిషి ఎక్కడ దొరుకుతాడని?'

'నగరమంతా గాలించి పట్టుకుంటాను. మీరెవరూ నన్ను వారించకండి.'

అని, ఆమెపట్టినపట్టు మూర్ఖంగావుందని తెలుసుకొన్నప్పటికి-

'సరే-వెళ్లు. నీ పిచ్చి వొదుల్తే నువ్వే వస్తావు' అని భూపాల రావు ఆమె చెయ్యి వొదిలిపెట్టాడు.

'అదేమండీ మీరుచేసేపని? ఆ పిల్ల యేమో ఆవేశంతో సాహసం చేస్తుంటే, మనం వారించాలిగాని, అర్ధరాత్రివేళ యింట్లోంచి వెళ్ళనిస్తామా?' అంది రాణియమ్మారావు.

'చెబుతే విననప్పుడేం చెయ్యాలి? మరేం ఫరవాలేదు. ఎక్కడికెడుతుందో వెళ్ళనియ్యి. తిరిగి తిరిగి అదే వొస్తుంది.'

అని భూపాలరావు విసుగ్గా అని, చెయ్యి వొదిలిపెట్టడమే తడవుగా, కుమారి మూడురకల్లో గదిదాటి, మేడదిగి వెళ్ళి పోయింది. తరువాత, తనవారు తన్నుగురించి ఏమనుకున్నదీ కూడా ఆమె లెక్క చెయ్యలేదు. గేటుదగ్గర యథాప్రకారం కావలి కాస్తున్న రిజర్వు పోలీసులు, ఆ సమయంలో వెలు పలకు పోతున్న కుమార్ని చూచి తెల్లబోయారు.

'ఇదేమిటమ్మగారూ! ఇంత రాత్రివేళ, ఒంటరిగా బయలు దేరా రెక్కడికో!' అని అందులో ఒకడడగ్గా—

'ఇటువంటి భోగట్టాలడగడానికే మీరున్నారు! జరిగే హత్యలు జరుగుతూనే వున్నాయి-మరమనిషి నింతవరకూ పట్టలేక పోయారు-ఎందుకూ మీరుండి ?'

అని, కుమారి తీక్షణంగా అడగిందానికా పోలీసులందరూ తలలు దించుకున్నారు. అంతలో ఆమె కేమిటో జ్ఞాపక మొచ్చింది. వడివడిగా వెనక్కొచ్చి, తానప్పుడప్పు డుపయోగించే కొత్త మోటారు బైసికిలా వరండాలో, వాటర్‌ప్రూఫ్ గుడ్డ కప్పబడివుంటే, దాన్నివతలకు తీసింది. చేతిలోని రివాల్వరును నడికట్టులో అమర్చుకొని, ఆ మోటారు బైసికిలు నక్కడే యెక్కి 'ర్‌య్' మని గేటుదాటి పోయింది. కాపలావారి కీసారి ఆమెను పలకరించే అవకాశమన్నా లేకుండా పోయింది.

నడిరోడ్డుగుండా ఆమె మోటారు బైకుమీద ఫుల్ స్పీడ్‌లో పోతుంటే, సోడాబండికో చిన్న చేతిలాంతరు తగిలించుకుని, తోసుకొస్తుంటే ఖాళీ సోడాలచప్పుడును దూరంనుంచే విని, అతను చంద్రమేమో, సినీమానుంచి, అమ్మకం ముగించుకొస్తున్నాడని, కుమారి అనుమానించింది. సోడాబండి దగ్గరవగానే బైసికిలుకు బ్రేక్‌వేసి ఆపి—'చంద్రం!' అంది. అతను చంద్రమే! సోడాబండిని నిలిపాడు. కుమారిని గుర్తించి నిర్ఘాంతపోయాడు.

'మీరేనా అండీ! ఎవరో అనుకున్నా-ఇంత రాత్రివేళ?-'

'అంతేగాదు-దగ్గరేమిటుందో చూశావా?' అంటూ, ఆమె నడికట్టులోవున్న రివాల్వరుగూడ లాగి, చంద్రానికి చూపగా, అతను అదరిపడి వెనుకడుగువేశాడు. కుమారి పకపకనవ్వుతూ-

'ఈ రివాల్వరుతో నిన్ను పేలుస్తాననుకున్నావా? ఛా! ఛా! కాదు. మరమనిషిని హతమార్చడానికి.''

అంటే, చంద్రం మరింత తెల్లబోయాడు. కుమారి ఉన్మాదిని అయిందేమోనని భయపడ్డాడు.

'ఇంతక్రితమే, ఆ మరమనిషి, వెనకాల ఓ యెర్రదీపం తగిలించుకొని నగర వీధుల్లో తిరిగాడనీ, పోలీసులు వెంట తరిమారనీ, వాడు దొరకలేదనీ, సినీమాహాలు దగ్గర గోలగా చెప్పుకున్నారు. ఆ మరమనిషినా ? మీరా ? చంపుతారా ?'

'అవును, మా దాదాని-కన్న వాత్సల్యంతో నన్ను పెంచిన దాదాని పొట్టపెట్టుకొన్న ఆ మరమనిషిని చంపితీరతాను.'

ఆ మాటలామెతెలివిగా అంటూందో, తెలివిలేకుండా అంటుందో అతని కర్థంకాలేదు, అయినా, బదులు చెప్పకుండా నిశ్చేష్టుడై నిలుచున్నాడు.

'ఆవేళ-పార్కులో నీతో ఎన్నో సంగతులు చెప్పాలనుకున్నాను. నా హృదయంలో పేరుకొన్న గుబులంతా తీర్చుకోవాలనుకున్నా, ఆ గేలబ్ గాడి మూలంగా, కాని అంతరాయం కలిగింది.'

అని ఆమె యింకా ఏమో చెబుతుండగా, చంద్రానికి మున్షీ బాబు విషయం జ్ఞాపక మొచ్చింది.

'సరేగానండీ ! మీ రెప్పుడన్నా బొంబాయి చూచారా ?'

'అలా అడుగుతున్నా వెందుకు ? నీకు బొంబాయి చూడాలని వుందా ? వుంటే నాతో రా-పోదాం.'

ఆనాటి ఆమె ధోరణి అంతా, చంద్రానికి చాలా వింతను కలిగిస్తూంది.

'ఆఁ ! అలాగే వస్తాగానండీ ! మీరు బొంబాయిలో కొంత కాల మున్నరా ?'

'నేను పుట్టిందే బొంబాయిలో! కాని పెరిగిందంతా యిక్కడే!'

అంతలో దూరాన ఒక ఎర్రలైటు కనవడ్డది. ఆమె వేగిర పడ్డది. చంద్రంతో యింకేమీ మాటలాడకుండా, మోటారును స్టార్టుచేసి-

'తిరిగి కలుసుకుందాం చంద్రం-ఏమీ అనుకోకు.' అనేసి, తన మోటారు సైకిలు నతివేగంగా పరుగెత్తించి, తన కపుపించిన ఎర్రదీపాన్ననుసరించింది. ఏమిటా సాహసం? ఎక్కడికా

ప్రయాణం? అర్థంగాని స్థితిలో చంద్రం అట్టె. నిర్విణ్ణుడై నిలుచుండిపోయాడు చాలాసేపు. కుమారి అటువంటి సాహసికు రాలని అతనెన్నడూ అనుకోలేదు-ఊహించయినా లేదు. అవ్వాటి ఆమె స్థితినిచూచి విభ్రాంతుడయినాడు. క్రోధంతో ఎర్రగా జేవ రించిన ఆ ముఖము-చేతిలో రివాల్వరు-ఆమె పలికే తీవ్ర వచ నాలు, అతనికి మతిపోగొట్టాయి. తను కనిపిస్తే చాలుననుకొనే మనిషి-తను కనుపించినప్పుడు, మాటలాడగల అవకాశాన్ని కూడా వొదులుకొని హఠాత్తుగా ఎక్కడికలా పరుగెత్తిందా అనుకొన్నాడు. పిచ్చివాడిలాగ అక్కడ నిలబడి, మోటారు బైసికిలు పరుగెడుతున్నవేపు విభ్రాంతుడై చూడగా చూడగా, దూరాన ఒక ఎర్రదీపం అతనికి కనుపించింది, ముందా యెర్ర దీపము-ఆ వెనుక కుమారి, మోటారు బైసికిలు! దానిని బట్టి ఆమె ఆ యెర్రదీపాన్ని వెంటాడ్డానికే బయలుదేరిందని అర్థం చేసుకున్నాడు.

ASIAN PRINTERS, MADRAS-5.

